

అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాసపత్రిక



## చందా వివరాలు

జీవిత చందా........... రూ॥ 400/-

3 సంవత్సరాల చందా..... రూ॥ 100/-

సంవత్సర చందా.......... రూ॥ 36/-

ఎయిర్ మెయిల్ (1 సం॥)... రూ॥ 130/-

సీ మెయిల్ (1 సం॥)....... రూ॥ 75/-

చందా పంపవలసిన చిరునామా

**రత్నా ఏజన్సీస్**

9, దేశికారోడ్, మైలాపూర్, మద్రాస్-600004.

ఫోన్: 73327

## ఈ సంచికలో

**డిసెంబరు 1989**



ముఖచిత్రం:

కలర్ ట్రాన్స్‌పరెన్సీ

కె.ఆర్.వి.భక్తం

ధ్యానం

## మనస్సుకి పట్టిన మబ్బు




తీక్షణమైన ఎండలకు భూమి బీటలు వారి ఎండిపోతుంది. వర్షాకాలం సమీపిస్తుంది. ఆకాశంలో మేఘాలు ఆవరించుకుంటాయి. వర్షపు జల్లులు పడతాయి. నేలలో తేమ చేరుకుంటుంది. పచ్చని పంటలతో సస్య సౌభాగ్యాన్ని కలిగించడానికి భూమి అనువుగా సారవంతమవుతుంది. పుష్కలంగా పంటలు పండుతాయి. మనో ప్రపంచంలో దుఃఖాలనే మేఘాలు ఆవరించుకుంటాయి. సహజమే. ప్రపంచంలో పద్ధ తరువాత సుఖ దుఃఖాలు, జయాపజయాలు ఎవరికి ఉండవు? నీ దుఃఖాలు, కష్టాలు మంచిగా పరిణమిస్తాయని నమ్మకం కుదుర్చుకో. భవిష్యత్తుని ప్రత్యాశతో చూడగలుగుతావు. నీ స్వధర్మం నీకు గోచరించక మానదు. శుష్కించి పోయిన నీ హృదయంలో దుఃఖ

(మిగతా 3 వ పేజీలో)

## సంకల్ప శక్తి

ఉత్తమ నాయకుని ముఖ్యలక్షణం సంకల్ప శక్తి. ఇది నిస్పృహతో నిరాశపోకుండా మానవుడు ప్రత్యాశతో ఉత్సాహవంతంగా జీవించడానికి సహకరిస్తుంది. సంకల్పశక్తి గల మానవుడు ప్రగతిపథంలో ధైర్యంగా, కృతనిశ్చయంతో ముందుకు సాగిపోతూ అనేక ఘనకార్యాలను సాధిస్తాడు. 'కష్టాలకు వెనుదీయనివాడు లక్ష్యాన్నైనా సాధించగలుగుతాడు' అని నాడో మెనాండెర్ చెప్పాడు.

మానసికంగా బలహీనులై సంకల్ప శక్తి లేనివారికి జీవితంలో వచ్చే అవకాశాలు గానీ జీవితంలో వైవిధ్యం గానీ ఏ మాత్రం తెలియవు. జీవితంలో తాము పొందే అపజయాలకు ఏవేవో సాకులు చెప్పుకుంటారు. అది వారి దురదృష్టం అనుకుంటారు. ఆ పనికి తాము తగమని అనుకుంటారు.

సంకల్ప శక్తి పెంపొందించుకోడానికి ఆత్మవిశ్వాసం బలపరచుకోవాలి. ఆత్మవిశ్వాసంతో పాటు ప్రత్యాశాభావం కూడా బలపరచుకోవాలి. అపజయాలను ధైర్యంతో ఎదుర్కొనేవారికి సంకల్ప శక్తి ప్రవృద్ధి చేసుకోడం సులభసాధ్యం. కారణం తెలుసుకుని నివారణకు ఉపక్రమించాలి. అభిలాష, లక్ష్యం, సాధన అనేవి మనస్సులో ప్రవృద్ధి పొందితే సంకల్ప శక్తి బ్రహ్మాండంగా పెరుగుతుంది. కార్యాన్ని సాధించగలమనే విశ్వాసాన్ని కలిగించుకోవాలి. 'నేను చేయ

...్య బీజాలను నాటదు, నీలో ఉన్న బీజాలను

గలను' అనే ఆశాభావం ఉత్సాహాన్ని కలిగించి విజయానికి దారితీస్తుంది.

నియంత్రిత పరిస్థితులలో సక్రమ సాధనవల్ల సంకల్ప శక్తిని సుస్థిరం చేసుకో



వచ్చు. ఆత్మశక్తి అనేది మోటారు కారులో ఇంజను వంటిది. దీనిని ప్రవర్తింప చేయడానికి ఒక బాహ్యశక్తి అవసరం. ఒక పని చేయాలనే యోచన, కృతనిశ్చయం ఉంటే పనులు వాటంతట అవే నిరాటంకంగా కొనసాగిపోతాయి. సమర్పణ భావంతో భావశుద్ధి కలిగి ఉండాలి.

మానవుడు భూగోళాన్ని చుట్టిరావడం, చంద్రలోకంలోకి రాకెట్లను ప్రయోగించడం, అణు విస్ఫోటనం చేయడం, గుండెలను తీసి గుండెలను మార్చి పెట్టడం మొదలైనవన్నీ సంకల్ప శక్తితో సాధించినవే.

(2వ పేజీ తరువాయి)

మేఘాలు నీ హృదయాన్ని ఆర్ద్రీభూతం చేస్తాయి. దుఃఖం ఉపశమిస్తుంది. విజ్ఞానం ప్రకాశిస్తుంది వివేకం పవృద్ధి పొందుతుంది. బుద్ధి మరింత తీక్షణంగా ఇతోధికంగా యోచింప గలుగుతుంది. హృదయంలో సంతోషం పెల్లుబుకుతుంది. కారుమబ్బులు భూమిని చల్లబరచి సారవంతం చేసినట్లే మనస్సులో మబ్బు వంటి దుఃఖం నీ హృదయాన్ని ఉన్నతాశయాలకు అనుకూలవంతం చేస్తుంది. దుఃఖం ఉపశమించినప్పుడే హృదయం పవిత్రవంతం అవుతుంది. అపహాస్యాలకు, అపవాదాలకు చోటు ఉండదు. ఆర్ద్రహృదయంలో అనుభూతి పెరుగుతుంది. మనస్సు మరింత తేటగా, నిష్కల్మషంగా ఉంటుంది. దుఃఖానుభవంతో నీవు పొందేదే వివేకాత్మకమై విజ్ఞానం. ఎన్ని దుఃఖాలు వచ్చినా, కొండ విరిగి మీదపడినా నిశ్చల తత్త్వం అభ్యాసం చేసుకో. ఆకాశంలో కారుమబ్బులు విడిపోయినట్టు మనస్సులో దుఃఖం పటాపంచలైపోతుంది.

# అద్భుతమైన మైనం

డినైస్ అల్లెన్ జ్వీకర్

మైనానికి సవాలక్ష ఉపయోగాలు ఉన్నాయి.

మైనంతో తయారైన క్రొవ్వొవత్తి దీపాలకు హైడ్రోకార్బన్‌వాక్స్ ఇంధనం. దీనికి ఆకర్షకవంతమైన రంగు, వాసన కూడా కల్పించవచ్చు. అగ్గిపుల్లలకు మైనంపూత



MUMMY - WAX IN CRAYONS PY

పెడతారు. మనం సాధారణంగా వాడుకునే పౌడర్ కప్పులకు మైనం పూతగా పెడతారు.

బొమ్మలు వేయడానికి ఉపయోగించే క్రెయాన్స్ మైనంతో తయారవుతాయి. మనం వాడుకునే పెన్సిళ్ళలో లెడ్‌చుట్టూ ఉండే సీడర్ కర్రభాగం సులభంగా చెక్కుకోడానికి మైనంలో నానబెడతారు. అట్టపెట్టెలు తడిసిపోయి చెమ్మఎక్కిపోకుండా దిట్టంగా ఉండడానికి మైనం పూత పెడతారు. చెమ్మ ఎక్కకుండా బాణాసంచాను మైనపు కాగితంతో చుట్టబెట్టి ఉంచుతారు. చాక్‌లెట్లు, చ్యూయింగ్ గమ్ మొదలైనవాటిలో గట్టితనానికి మైనం ఉపయోగిస్తారు. ప్రింటింగ్ ఇంకుల తయారీకి దీనిని ఉపయోగిస్తారు. సౌందర్య వర్థక సాధనాలలోను, రోమనాశిమలలోను దీనిని వాడతారు.

రంగులేని మైనం సౌందర్య వర్థక వస్తువుల్లో వాడడానికి ఆదర్శవంతమైనది. వాతావరణానికి చెడిపోకుండా సామానుల్ని పాక్‌చేయడానికి వాడతారు. ఔషధాల తయారీకి, ఇంధనానికి ఉపయోగపడుతుంది. త్వరగా అంటుకుని మండే సహజగుణంవల్ల దీనిని ఇంధనంగా ఉపయోగిస్తారు. అచ్చులు పోతలు పోయడానికి ఇది ఉపయోగపడుతుంది ముఖ్యంగా ఆభరణాల తయారీకి, కృత్రిమ దంతాల పోతకు అచ్చుల తయారీకి దీనిని విరివిగా ఉపయోగిస్తారు. విద్యుద్వాహక కాదు కాబట్టి ఆదర్శకరమైన ఇన్సులేటరుగా దీనిని ఉపయోగిస్తారు.

అనేక శతాబ్దాలనుంచి మైనం అనేక విధాలుగా ఉపయోగపడుతూంది. 4200 బి.సి లోనే మరణించిన శరీరాలను భద్రపరచడానికి మైనపు పూత పెడుతుండేవారు. ఈజిప్షియనులు శవాలకు కప్పే బట్టలకు మైనపుపూత పెట్టేవారు. శవపేటికలకు

మిక్కిలి ప్రసిద్ధిపొందిన పాతకారుల మ్యూజియం

బ్రిటన్‌లో ది మాంచెగ్ మ్యూజియం

ప్రసిద్ధిపొందిన పాత

కారత

క్రొవ్వు పూతపెట్టి సీలు చేసేవారు. ఈజిప్షియనులు క్రొవ్వుతో వ్రాత పలకలను తయారుచేసుకునేవారు. ఈ వ్రాత పలకలను పేచుతో చేర్చిపెట్టి ఉంచేవారు. మొట్టమొదట వీరే పుస్తకాల తయారీకి ప్రారంభకులు.



అనేక శతాబ్దాలవరకు తేనెపట్టులో ఉండే మైనాన్ని కరిగించి మైనం తయారు చేసుకునేవారు. ఇంగ్లీషులో వాక్స్ (Wax) అనే పదం ఆంగ్లోశాక్సన్ వీక్స్ (Weax) లేక బీస్‌వాక్స్ (Bees wax) నుంచి ఏర్పడింది. తేనెపట్టునుంచి దీనిని చేయాలంటే శ్రమతో కూడిన పని. అందుచే నవ్యకల్పనా శక్తిగల మానవుడు మైనంకోసం ఇతర ఆధారాలను వెతుక్కున్నాడు.

చైనాలో ఒక విధమైన కీటకాలు చెట్ల మీద మైనాన్ని కూడబెడతాయి. భారత దేశంలో ఇదే విధంగా కొన్నిరకాల కీటకాలు చెట్లమీద లక్కను చేర్చిపెడతాయి. స్పెర్మాసిటీ అనే మైనం స్పెర్మ్ తిమింగిలాల శరీరాంతర్భాగాల నుండి లభిస్తుంది (ఇటీవల ఈ తిమింగిలాలు అంతరించిపోయే పరిస్థితులలో ఉన్నాయి). ఉన్ని మైనం (Wool wax) సాధారణంగా ఉన్ని జంతువుల నుండి లభిస్తుంది. దీనిని శుభ్రపరచి శుద్ధిచేసి లెనోలిన్ వంటి ఇతర మైనాలు తయారుచేస్తారు. వృక్ష సంబంధమైన మైనాన్ని కొన్ని చెట్లనుండి లభింప చేసుకుంటున్నారు. సాధారణంగా ఉష్ణప్రదేశాలలో ఉష్ణానికి చెట్లలో జీవరసాలు ఆవిరి అయిపోకుండా వాటి కాండానికి ఆకులకు మైనపు పూత ఉంటుంది. బ్రెజిల్‌లో కార్నాబా (తాటిచెట్లవంటివి) చెట్లనుంచి కార్నాబా మైనం, జపానులో, చైనాలోను ఒక విధమైన సుమాక్ (sumac) చెట్ల బెర్రీలనుంచి జపాన్ మైనం, యునైటెడ్ స్టేట్స్ ఈశాన్య దిక్కున బెర్రీ చెట్ల పండ్లనుంచి బేబెర్రీ మైనం తయారుచేస్తున్నారు.

వాక్స్‌షేల్స్ (రాతి పొరలలో) లభించే ఓజోకెరైట్, లిగ్నైటునుంచి మోంటాన్ వాక్స్, పీటునుంచి పీట్‌వాక్స్ లభిస్తుంది. ఇదిగాక అతిసులభంగానూ, చౌకగాను పెట్రోలునుంచి మైనం లభిస్తుంది (పెట్రో

## మిక్కిలి చిన్న ఎలక్ట్రిసిటీ మీటరు

స్వీడన్‌లో శాస్త్రజ్ఞులు ప్రపంచంలో మిక్కిలి చిన్న ఎలక్ట్రిసిటీ మీటర్‌ను రూపొందించారు. దీనిని చిన్నచిన్న కొయ్య పెట్టెలలోను, డిస్ట్రిబ్యూషన్ బోర్డులలోను మరియు ఇతర యాంత్రిక భాగాలలోను అతి సౌలభ్యంగా అమర్చుకోవచ్చు.

యం వాక్స్). ఇది ముడినూనె నుంచి ందెన తైలాలు తయారు చేసేటప్పుడు గౌణపదార్థంగా ఏర్పడుతుంది.

కొన్ని ద్రావణీయాల సహాయంతో ందెనలకు ఉపయోగించే ల్యూబ్రికేటింగ్ తైలాలలో క్రొవ్వును వేరుచేస్తారు. ఈ విధంగా వేరుచేసిన మైనాన్ని ఉదజని సహాయంతో శుద్ధిచేసి కల్మషాలను తీసేస్తారు. పరిశుద్ధమైన మైనం పలకలుగా తయారుచేసి గాని, ద్రవరూపంలో గాని రైలు, ట్రక్ టాంకులలో ఎగుమతి చేస్తారు.

ప్రాచీన చారిత్రక కాలంలో పెట్రోలియం మైనాన్ని దీపాలుగా వెలిగించుకునే క్రొవ్వువత్తుల తయారీకి మాత్రమే ఉపయోగించేవారు. కానీ నేడు క్రొవ్వువత్తుల తయారీకేగాక ఇతర అనేక పనులకు ఉపయోగపడుతూంది. కాగితపు పరిశ్రమలో పెట్రోలియం వాక్స్, కాగితంతో చేసే కప్పులను చుట్టుకు పోనీయదు. మడత పెట్టడానికి, ఎటుపడితే అటు వంచడానికి వీలుగా ఉండేటట్టు తయారుచేస్తుంది దీనివల్ల కాగితం దీర్ఘకాలం మన్నుతుంది సులభంగా చెమ్మ ఎక్కిపోదు, నునుపు ఎక్కువ అవుతుంది. సులభంగా చెడిపోదు.

విద్యుత్పరిశ్రమలలో కూడా పెట్రోలియం మైనం అనేక విధాలుగా ఉపయోగపడుతుంది. ముఖ్యంగా రాగితీగల ఇన్సులేషన్ కేగాక ట్రాన్స్‌ఫార్మర్లకు, కండెన్సర్లకు ఉపయోగపడుతుంది. భూమి అడుగున టెలిగ్రాపు, టెలిఫోను తీగలకు తగిన రక్షణను కలిగిస్తుంది.

పెట్రోలియం మైనాన్ని నూలు పరిశ్రమలో కూడా ఉపయోగిస్తున్నారు. టెంటులు, టార్పాలిన్ తయారీకి, మైనపుబట్టల తయారీకి ఉపయోగపడుతుంది.

పెట్రోలియం మైనాన్ని రబ్బరుతో మే వించినప్పుడు ఇది టైరుల ఉపరితలానికి కూడా విస్తరించుకుని టైర్లకు రక్షణను కలిగించే బ్లూమ్ (Bloom)గా ఏర్పడుతుంది దీనివల్ల టైర్లకు ఓజోను మరియు అతి నీలలోహిత కిరణాలవల్ల అపాయం ఏర్పడదు.

కొన్ని ఔషధాలకు మూలవస్తువుగ మైనం ఉపయోగపడుతుంది. సాధారణంగ శరీరం పై పూతకు వాడే మందులలో వా

(మిగతా 9 వ పేజీలో)

## మనసులో కంటకాలు



భూమిమీద మార్గంలో ముళ్ళు మన ప్రగతికి ఎలా ఆటంకం కలిగిస్తాయో అదే విధంగా మనసులో కామ, క్రోధ, లోభా వంటి కంటకాలు విజ్ఞానాభివృద్ధికి ఆటంకాల కలిగిస్తాయి.

## క్విజ్

1. న్యూస్‌ప్రింట్ ఫాక్టరీ ఉన్న నేపా నగర్ ఎక్కడ ఉంది?

(ఎ) గుజరాత్, (బి) హిమాచల్ ప్రదేశ్, (సి) మధ్యప్రదేశ్, (డి) బీహార్.

2. క్రింది ఏ దేశంలో అత్యధిక ఉష్ణోగ్రత ఉంటుంది?



(ఎ) మెక్సికో, (బి) స్వీడెన్, (సి) న్యూజిలాండ్, (డి) నైజీరియా.

3. భారత దేశంలో ప్రచురింపబడిన మొట్టమొదటి వార్తాపత్రిక ఏది?

(ఎ) లీడర్, (బి) అమృత్ బజార్ పత్రిక, (సి) బెంగాల్ గెజిట్, (డి) బాంబే హెరాల్డ్.

4. 'ది టేల్ ఆఫ్ టు సిటీస్' రచించినది ఎవరు?

(ఎ) చార్లెస్ డికెన్స్, (బి) డానియల్ డీఫో, (సి) రాబర్ట్ బ్రిడ్జెస్, (డి) ఆడమ్ స్మిత్.

5. క్రిందివారిలో ఎవరు ప్రతి సంవత్సరం ప్రయాగలో మత సమావేశం ఏర్పర చేవారు?

(ఎ) అశోకచక్రవర్తి, (బి) కనిష్కుడు,

## క్షించుకోండి

(సి) హర్షుడు, (డి) రెండవ పులకేశి.

6. భారతదేశంలో రాష్ట్రానికి గవర్నరుని ఎవరు నియమిస్తారు?

(ఎ) అధ్యక్షుడు, (బి) రాష్ట్ర ముఖ్యమంత్రి, (సి) ప్రధానమంత్రి, (డి) భారత దేశపు ఉపాధ్యక్షుడు.

7. కోరియోగ్రాఫీ (Choreography) దీనికి సంబంధించినది:

(ఎ) డాన్సింగ్, (బి) నాటకం, (సి) పెయింటింగ్, (డి) సంగీతం.



‌రిస్థితులు మనిషిని మార్చవు, ఆ మనిషి

8. వీటిలో ఏది డైరక్ట్ టాక్స్ కాదు?

(ఎ) ఎస్టేట్ డ్యూటీ, (బి) ఇన్‌కమ్ టాక్స్, (సి) కార్పొరేషన్ టాక్స్, (డి) ఎక్సైజ్ డ్యూటీ.

## తెలివి ప

1. ఆచార్య చతుష్టయం అంటే ఎవరు?

2. పైవారిలో "రెండు ఎప్పుడూ రెండే, ఎప్పుడూ ఒకటికాదు" అని ఎవరు బోధించారు? ఆ రెండూ ఏవి?

3. భారత ప్రజల సేవకై తన జీవితాన్ని అంకితం చేసుకున్న యుగోస్లేవియా వనిత ఎవరు?

4. ఒక 60 అడుగుల పొడవుగల డీసెల్ ట్రెయిన్ గంటకు 60 మైళ్ళ వేగంతో ప్రయాణం చేస్తూంది. అప్పుడు గాలి సెకండుకు ఆరుగజాల వేగంతో వీస్తూంది. ఇంజను పొగ 60 గజాల దూరంలో ఉన్నప్పుడు ట్రెయిన్ ఎంత దూరం ప్రయాణం చేసి ఉంటుంది?

5. ఎండకు వానకు ఉపయోగించుకోలేని గొడుగు కాని గొడుగు ఏదో చెప్పండి?

6. 9 అనే సంఖ్య అందమైన నెమిలి. ఎందుచేత?

## మాటల మహిమ

1. అడ్డము: ఆటంకము (ఎ), వెడల్పు (బి), చాటు (సి), తాకట్టు (డి).

2. ఆమడ: దూరంకొలత ప్రమాణం (ఎ), పుల్లపెరుగులో వేసిన వడ (బి), కోరదగిన కోరిక (సి), శరీరాంగము (డి).

3. ఇబ్బంది: అనివార్యమైన బాధ (ఎ), మూర్ఖుడు (బి), మరుగుచోటు (సి), అణగు (డి).

4. ఏరువాక: ఏటేటా చేయు దుక్కి ప్రారంభము (ఎ), నడిరోడ్డు (బి), కాలువ (సి), వడకట్టు సాధనము (డి).

5. వంత: ఏరు (ఎ), చింత (బి), బాధ (సి), ఏడుపు (డి).

6. వామి: గడ్డిమేట (ఎ), అరగుర్రము లేక గాడిద (బి), నేత (సి), నోరు (డి).

7. వీరిడి: ప్రజ్ఞాశాలి (ఎ), అవివేకి (బి), వగులు (సి), శౌర్యము (డి).

8. వేకువ: వేగిరపాటు (ఎ), ప్రభాతము (బి), వడి (సి), త్వర (డి).

(జవాబులకు వ పేజీ చూడండి)

## చైతన్యవంతమైన మాటలు




భారతదేశాన్ని ప్రేమిస్తున్నానంటే దాని భూగోళ పరిస్థితులను బట్టికాదు. అక్కడ జన్మించానని కాదు. దేశం కష్ట భూయిష్ఠమైన కాల పరిస్థితులనుంచి బైటపడింది కాబట్టి, జ్ఞానోదయం పొందిన మహాత్ములు చెప్పిన మాటలు చైతన్యవంతమైనవి కాబట్టి.

—రవీంద్రనాథ్ టాగూర్

# ఆచార్యచతుష్టయం-వల్లభాచార్యులు

పౌరాణికంగా సృష్టి, స్థితి, లయ కారులని ప్రసిద్ధిపొందిన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు త్రిమూర్తులు. ఆ త్రిమూర్తులలో శివుడే ఏకైక దైవమని, ఆ శివుడే దివ్య లింగ స్వరూపుడని వేదాలు, ఆగమాలు,



శాస్త్రాలు, ఇతిహాసాలు మొదలైనవాటి ప్రమాణాలతో లింగ సాంప్రదాయాన్ని శ్రీపతి పండితుడు, శివలెంక మంచన పండితుడు, మల్లికార్జున పండితుడు నిరూపించారు. ఈ ముగ్గురు పండితత్రయం.

రాజమహేంద్రవరం రాజధానిగా వేంగి దేశాన్ని పాలించిన చాళుక్యరాజైన రాజరాజ నరేంద్రుని ఆస్థానాన్ని అలంకరించి సంస్కృత భారతం 18 పర్వాలలో ఆది పర్వము, సభాపర్వము, అరణ్యపర్వములో సగం వ్రాసిన 11 వ శతాబ్దపు ఆదికవి నన్నయ భారతంలో నాల్గవ పర్వంనుంచి మిగిలిన 15 పర్వాలు చివర దాకా అనన్య కవితా శిల్పసౌందర్యంతో తెలుగు చేసిన 13వ శతాబ్దపు కవిబ్రహ్మ తిక్కనసోమయాజి ఇక మిగిలిన అరణ్యపర్వ శేషభాగం మాత్రం తెలుగు చేసిన 14 వ శతాబ్దపు ఎర్రాప్రెగ్గడ కవిత్రయం.

1767-1847 మధ్యయుగంలో స్వతంత్ర ధాతు కల్పనాత్మకమైన అపూర్వ కీర్తనలతో దక్షిణ భారత సంగీతానికి అఖండ వ్యాప్తిని చేకూర్చిన అవతారమూర్తులు వాగ్గేయ కారులు అయిన త్యాగరాజు, శ్యామాశాస్త్రి, ముత్తుస్వామి దీక్షితులు సంగీత త్రిమూర్తులు. వీరినే సంగీత రత్నత్రయం అని కూడా అంటారు. ఇదేవిధంగా ఆచార్యులలో శంకర, రామానుజ, మధ్వమహాచార్యుల తరువాత వల్లభాచార్యులను చేర్చి ఈ నలుగురిని ఆచార్య చతుష్టయం అన్నారు.

( 6 వ పేజీ తరువాయి)

తారు. చర్మంలో సూక్ష్మకణాభివృద్ధికి కూడా ఇది సహకరిస్తుంది. ఫోటో కాపీలు మరియు ప్రెషర్ సెన్సిటివ్ టెక్నాలజీలవల్ల మైనాన్ని ఉపయోగించే కార్బను పేపరు ఉపయోగం తగ్గిపోయింది. కాపీ ఇతరత్రా పెట్రోలియం మైనానికి ఉపయోగాలు అధికమవుతున్నాయి. క్రొత్తగా ఫైర్‌ప్లేస్ లాగ్ తయారీలో అధికంగా ఉపయోగిస్తున్నారు. మైనపు కాగితం, మాత్రల పైపూత, పెదిమలు ఎండి పోకుండా పెదిమలకు ములాము, ప్లాస్టిక్స్, టైప్‌రైటర్ రిబ్బన్స్, లూబ్రికెంట్సుకి పెట్రోలియం వాక్స్(మైనం) చాలా ముఖ్యం.

— 'లాంప్' సౌజన్యంతో

'తమ తప్పులను కప్పిపుచ్చుకోవాలని ప్రయత్నించే

క్రీ.శ. 8 వ శతాబ్దానికి చెందిన శంకరాచార్యులు ప్రపంచంలో మిక్కిలి గొప్ప మతప్రవక్తలుగా పరిగణింపబడే ఆధ్యాత్మిక గురువులలో ఒకరు, జగద్గురువు. వీరు చండాలుని పాదాలకు సాష్టాంగ నమస్కారం చేసి మనిషి చండాలుడైతేనేమి? బ్రాహ్మణుడైతేనేమి? ఆత్మజ్ఞానం కలవాడైతే అటువంటి



వానినే గురువుగా అంగీకరించుటకు తనకు అభ్యంతరం లేదని జ్ఞానోదయం తెచ్చుకుని అన్ని సిద్ధాంతాలలో అద్వైత సిద్ధాంతమే పరమ ప్రమాణమని దానిని స్థాపించిన మహనీయులు. శంకరులు భారతదేశంలో బదరీనాథ్ (ఉత్తర ప్రదేశ్), పూరీ (ఒరిస్సా), శృంగేరి (కర్ణాటక) ద్వారక (గుజరాత్) లలో శంకర మఠాలు నాలుగు స్థాపించారు.

మతకలహాలు అధికమైన 11వ శతాబ్దంలో విశిష్టాద్వైత మత ప్రచారం నిర్విఘ్నంగా కొనసాగించిన వైష్ణవ మతాచార్యులు రామానుజులు. వీరి దర్శనం ప్రకారం తత్త్వములు మూడు - చిత్తు, అచిత్తు, జగత్తు. బ్రహ్మసత్యం, చిదచిద్రూపమైన జగత్తు అవిద్యా కల్పితము అనే శంకరాద్వైతాన్ని ఖండించి, చిదచిత్తులు పరబ్రహ్మకు శరీరములనే సిద్ధాంతాన్ని సోపపత్తికముగా స్థాపించారు. దేశంలో అనేక దేవాలయాలను సందర్శించి ఆయా దేవాలయాలలో వైష్ణవ మతప్రకారం అర్చనా విధానాన్ని నెలకొల్పిన ఆసూరి రామానుజాచార్యులు ఆంధ్రుడని ఒక ప్రతీతి.

13వ శతాబ్దానికి చెందిన మధ్వాచార్యులు శంకరులు స్థాపించిన అద్వైత మతాన్ని ఖండించి క్రొత్తగా ద్వైతమతాన్ని దేశమంతటా వ్యాపింపజేశారు. భక్తితో శ్రీకృష్ణుని సేవిస్తూ నీతినియమాలతో పవిత్రంగా జీవించడమే మానవులకు సులభమైన తరుణోపాయం అని చెప్పారు. వీరి

## ప్రపంచంలో మిక్కిలి పెద్ద పేడీ ప్రోసెసింగ్ ప్లాంట్

ప్రపంచంలో మిక్కిలి పెద్ద పేడీ ప్రోసెసింగ్ ప్లాంట్ (ధాన్య శుద్ధీకరణ ఫాక్టరీ) పంజాబులో లూధియానాకు సుమారు 45 కి.మీ. దూరంలో ధూరి (సంగ్‌రూర్) వద్ద ఏర్పాటు చేయబడింది. ఆసియాలో మిక్కిలి పెద్ద రూ. 62 కోట్లు విలువచేసే ఈ కాంప్లెక్స్‌లో ధాన్యం శుద్ధిచేసిన తరువాత వచ్చే పొల్లునుండి (చిట్టు) లూబ్రికేటింగ్ తైలాల శుద్ధీకరణకు ఉపయోగించే ఫర్‌ఫురాల్ (Furfural) అనే ఆర్గానిక్ సాల్వెంటును తయారుచేసే కాంప్లెక్స్ కూడా

'సుఖాలను చేరుకో, దుఃఖాలను వదులుకో,

వైష్ణవాన్ని సద్వైష్ణవం అంటారు. వీరు ఉడిపిలో శ్రీకృష్ణుని ఆలయం నిర్మించి ఎనిమిదిమంది బాలురను ఎన్నుకుని వారిని మఠాధిపతులుగాను, శ్రీకృష్ణుని పూజారులుగాను తీర్చిదిద్దారు. వీరు దీర్ఘకాలం జీవించి చివరిదాకా నిర్విరామంగా తమ మత ప్రచార కృషి కొనసాగిస్తూ వివిధ రచనల ద్వారా,



చర్చల ద్వారా ఉపన్యాసాల ద్వారా ద్వైత మతాన్ని దేశమంతటా వ్యాపింపజేశారు. జీవులలో అనేక భేదాలు ఉన్నాయని ఆనంద స్వరూపుడైన విష్ణువు చిత్ (చైతన్యంగల జీవుడు) అచిత్ (చైతన్యంలేని జడపదార్థం) వేరు వేరని ప్రతిపాదిస్తూ జీవులందరూ విష్ణువు అధీనంలో ఉంటారని, విష్ణువు అనుగ్రహం పొందిన పుణ్యజీవులు ముక్తిని పొందుతారని, మధ్య రకం జీవులు జనన మరణ చక్రంలో పరిభ్రమిస్తూంటారని, పాపులకు నరకమే ప్రాప్తి అని ప్రచారం చేశారు.

ఆచార్య చతుష్టయంలో ప్రఖ్యాతిచెందిన నలుగురు ఆచార్యులు శంకర, రామానుజ, మధ్వ మహాచార్యుల తరువాత నాల్గవవారు చివరివారు వల్లభాచార్యులు (క్రీ.శ. 1473-1531). వీరు ఈశ్వర సాక్షాత్కారం పొందిన మహా విద్వాంసులు. ఆంధ్రప్రదేశ్‌లో కృష్ణా గోదావరి మధ్యప్రదేశంలో కాకరవాడ గ్రామానికి చెందిన కంభంపాటి లక్ష్మణభట్టు, ఎల్లమ్మ దంపతుల పుత్రుడు తలిదండ్రుల కాశీయాత్రలో రాయ్‌పూర్ (మధ్యప్రదేశ్)లో వీరు జన్మించారు. చిన్నతనంలోనే వల్లభాచార్యులు ఉద్దండసంస్కృత పండితుడైన తండ్రిగారివద్ద వేదవేదాంగాలు, సాహిత్యం అభ్యసించి గొప్ప పండితుడుగా ప్రసిద్ధిపొందారు.

వీరు శంకరులు ప్రచారం చేసిన జ్ఞాన సిద్ధాంతాలకీ, రామానుజులు ప్రచారం చేసిన భక్తి సిద్ధాంతాలకీ, మధ్వాచార్యులు ప్రచారం చేసిన కర్మ సిద్ధాంతాలకీ నూతన దృష్టితో క్రొత్త అర్థాలు చెప్పి పుష్టి మార్గాన్ని వ్యాపింపజేశారు. పరిశుద్ధమైన ప్రేమద్వారా పరమేశ్వరుని ఆరాధించడం, ప్రేమతత్వాన్ని పెంచుకుంటూ ఈశ్వర సాన్నిధ్యంలో నివసించడమే పుష్టిమార్గ వైశిష్ట్యము. వీరు శంకరాచార్యుల మాయావాదాన్ని ఖండిస్తూ వర్ణవిచక్షణ, స్త్రీ పురుష భేదం లేకుండా

## జాండీస్‌కి నిమ్మరసం

కళ్ళు మరియు శరీరం అంతా పచ్చబడిపోయే కామెర్లు (జాండీస్) రోగానికి నిమ్మపండు అమోఘమైన ఔషధం. 20 గ్రాముల నిమ్మరసం నీటితో కలిపి మాటిమాటికి త్రాగిస్తే కామెర్ల రోగం వెంటనే తగ్గిపోతుంది. —జి. ఎస్. వర్మ

అందరూ ఆచరించగల తరుణోపాయం సులభమార్గంలో చూపించారు. భేదభావం లేని మార్గమే వేదసమ్మతం, విశ్వ జనీనం అని నిరూపించిన గొప్ప సంస్కరణకర్త. మోక్షం పొందడానికి పరమాత్ముని పట్ల నిష్కలంకమైన ప్రేమపూర్వక స్నేహం ద్వారా రసానుభూతిని పొందడమే పుష్టి మార్గపు ముఖ్య సందేశం.

శ్రీకృష్ణుని (గోపీ వల్లభుని) స్నేహం పొందాలంటే వీరు గోపికల సహాయం పొందమన్నారు. వల్లభాచార్యుల భక్తులు భజించే దేవుడు గోవర్ధననాథ్ (నాథ్ జీ). వీరి ముఖ్య తీర్థస్థానము రాజస్థాన్‌లోని నాథ్ ద్వారా. భాగవతమే వీరికి ప్రమాణము. భాగవత ధర్మానుసారంగా దేవతా విగ్రహం నిర్మింపబడింది. గోవర్ధననాథ్ పూర్ణ పురుషోత్తముడు. ఈశ్వర సేవయే మోక్షసాధనం అని పుష్టిమార్గం చెబుతుంది. గుజరాత్, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్ పశ్చిమ ప్రాంతాలలో వల్లభాచార్యుల మతం విస్తారంగా వ్యాపించింది. చాలామంది తెలుగువారు మతప్రచారం కోసం ఇక్కడకు వచ్చి నివాసాలు ఏర్పరచుకున్నారు. శ్రీ కృష్ణదేవరాయల వారు విద్వత్సదస్సులో వీరికి కనకాభిషేకం చేసి "ఆచార్య" బిరుదును ఇచ్చి గౌరవించారు.

గొప్ప పండితుడు, శుద్ధాద్వైత మనే పుష్టిమార్గ స్థాపకుడు అగు వల్లభాచార్యులు వేదాలకు, భగవద్గీతకు, బ్రహ్మసూత్రాలకు, భాగవతానికి భాష్యాలు వ్రాసారు.

అధరం మధురం వదనం మధురం
నయనం మధురం హసితం మధురం
హృదయం మధురం గమనం మధురం
మధురాధిపతే రఖిలం మధురం

అనే మధురాష్టకం వీరు రచించినదే. వేదాలలో వచ్చే సందేహాలు భగవద్గీతలోను, భగవద్గీతలో వచ్చే సందేహాలు బ్రహ్మ సూత్రాలలోను, బ్రహ్మసూత్రాలలో సందేహాలు భాగవతంలోను తీర్చుకోవచ్చని వీరు నిరూపించారు.

"వాధూల"

## ప్రపంచంలో మిక్కిలి క్రూరమైన జంతువు




ఆస్ట్రేలియాలో చారల టాస్మేనియన్ తోడేలు (Tasmanian Wolf) ప్రపంచంలో మిక్కిలి క్రూరమైన జంతువు. ఇది శరీరానికి అడుగున తన కడుపు భాగంలో ఉండే సంచిలో చిన్నపిల్లను పెట్టుకుని సంరక్షిస్తుంది. ఆస్ట్రేలియా టాస్మేనియా ద్వీపంలో ఎవ్వరూ ప్రవేశించలేని కొండ ప్రదేశాలలో ఇవి దాక్కుంటాయి.

# వీరిని గురించి తెలుసుకోండి

**ఛార్లీ ఛాప్లిన్:**

సుప్రసిద్ధ ఆంగ్లేయ హాస్యనటుడు, డైరక్టరు మరియు ప్రొడ్యూసర్. 'ది కిడ్' 'ది గోల్డ్‌రష్', 'సిటీ లైట్స్' వంటి క్లాసిక్ చిత్రాలలో నటించి స్వంతంగా ప్రొడ్యూసు



చేసాడు. ఇతడు ది గ్రేట్ డిక్టేటర్ మోడరన్ టైమ్స్, ది సర్కస్ చిత్రాలను కూడా తీశాడు. సినీరంగంలో 1914 నుంచి ఇతడు చేసిన బ్రహ్మాండమైన సేవకు కాన్స్ ఫిల్మోత్సవంలో 1971 లో ప్రత్యేక బహుమానంతో గౌరవింపబడ్డాడు.

* * *

**నోవా వెబ్‌స్టర్ (1758 - 1843) :**

అమెరికన్ నిఘంటు కర్త మరియు న్యాయవాది. ఇతడి 'అమెరికన్ డిక్షనరీ ఆఫ్ ది ఇంగ్లీషు లాంగ్వేజి' (1828) మిక్కిలి ప్రశస్తిని పొందింది. ఇతని "బ్లూ బాక్ స్పెల్లరు"గా ప్రసిద్ధిపొందిన 'ఎలిమెంటరీ స్పెల్లింగ్ బుక్' ఒక మిలియను పైబడిన కాపీలు అమ్మబడ్డాయి దీనిని విద్యార్థులు చదువుకునే విధానం నేర్పే గ్రంథంగా పాఠశాలలో ఉపయోగించేవారు. వాణిజ్య వరణం. కేంద్రప్రభుత్వ విధానం, వైద్య, చరిత్ర మొదలైన విషయాలపై వ్యాసాలు రచించాడు.

* * *

**డాగ్ హమ్మర్స్క్ జోల్డ్:**

స్వీడన్‌దేశపు ఆర్థికవేత్త మరియు రాజకీయ చతురుడు. ఇతడు 1953 నుంచి యునైటెడ్ నేషన్స్ సెక్రటరీ జనరల్‌గా ఉన్నాడు. ఆఫ్రికా (ఇప్పుడు జెయిరె) కాంగోలో ప్రజాయుద్ధాన్ని విరమింప చేయడానికి ప్రయత్నిస్తున్నప్పుడు 1961 లో వాయు విమాన ప్రమాదంలో మరణించాడు.

* * *

**ప్రపంచంలో అతి ప్రాచీనమై శిలా చిత్రాలు**

టాస్మేనియా (ఆస్ట్రేలియా) లో మా... వెర్ నది గట్టుమీద పురావస్తు శాస్త్ర... ఆదికాలపు శిలా చిత్రాలను కనుగొన్నా... ఎర్ర జేగురు వర్ణంలో మానవుని చేతు... చిత్రింపబడ్డాయి. బ్రహ్మాండమైన సున్న... రాతి గుహలలో పైకప్పు భాగంలో ... చిత్రాలు కనిపించాయి. ఇది అదమ... 14,000 సంవత్సరాలకు పూర్వం చిత్రిం... చబడినవి. ప్రపంచంలో మిక్కిలి ప్రాచీ... మైనవి.

'తమకు దొరికిన పదార్థాన్ని తా మొక్కరే అనుభవించక

సర్ జూలియన్ హక్స్లే :

1946 లో ఇతడు యునైటెడ్ స్టేట్స్ ఎడ్యుకేషనల్, సైంటిఫిక్ అండ్ కల్చరల్ ఆర్గనైజేషన్ (UNESCO) ప్రారంభించ డానికి సహాయం చేసాడు. సుప్రసిద్ధ జీవశాస్త్ర వేత్త. పరిణామ సిద్ధాంతం మీదఅపూర్వమైన రచనలు చేసాడు.

* * *

ఎమీలియా ఇయర్‌హర్ట్ (1898-1937):

అమెరికాకు చెందిన వైమానిక యోధిని. అట్లాంటిక్ మహాసముద్రం మీదుగా, పసిఫిక్ మహాసముద్రం మీద కొంతదూరం ఒంటరిగా విమానంమీద ప్రయాణించేసిన మొదటి మహిళ సుప్రసిద్ధ సంఘసేవకురాలు, ఉపా ధ్యాయిని. 1937 లో ఇంకొకరితో చేరి విమానం మీద ప్రపంచాన్ని చుట్టి రావడానికి బయలుదేరింది. కాని ఆ విమానం పసిఫిక్ మహాసముద్రంలో న్యూగినీ, హాలండ్ ద్వీపం మధ్య మాయమైపోయింది.

* * *

మిగుయెల్ డి సెర్వాంటెస్ (1547 - 1616) :

స్పెయిన్ దేశపు సుప్రసిద్ధ నవలా రచయిత. ప్రసిద్ధిపొందిన ఇతడి 'డాన్ క్విక్సోట్' (Don Quixote) బైబిల్ తరువాత ప్రపంచంలో ఎక్కువ భాషలలోకి తర్జుమా చేయబడింది. సెర్వాంటెస్ ఆజీవి కాంతం దారిద్ర్యాన్ని అనుభవించాడు. చిన్న చిన్న నేరాలకు అనేకసార్లు చెరసాలలో ఉన్నాడు.

## కొన్ని గ్రంథాలు - రచయితలు




| | | |
|---|---|---|
| అభిజ్ఞాన శాకుంతలం (సంస్కృతం) | : | కాళిదాసు |
| ఎ టేల్ ఆఫ్ టు సిటీస్ | : | చార్లెస్ డికెన్స్ |
| అన్నా కెరెనీనా | : | లియో టాల్‌స్టాయ్ |
| ది గైడ్ | : | ఆర్. కె. నారాయణ్ |
| ఏసియన్ డ్రామా | : | గున్నార్ మిర్‌డాల్ |
| హామ్లెట్ | : | విలియం షేక్‌స్పియర్ |
| మెయిన్ కాంఫ్ | : | అడాల్ఫ్ హిట్లర్ |

"మనిషి గొప్పతనం హృదయంలో ఉంటుంది. మెదడులో కాదు."

# తిరువణ్ణామలై

ఎన్. రామకృష్ణ

ఉత్సాహంతో చేతులు జోడించి పైకి ఎత్తి 'అణ్ణామలైక్కు హరోహర' అనే కేకలు వినిపిస్తూంటే తిరువణ్ణామలై జ్ఞాపకం వస్తుంది. అణ్ణామలై క్షేత్రం తమిళనాడులో విల్లుపురం నుండి 63 కి మీ.ల దూరంలో ఉంది. దీనికి ప్రాముఖ్యత ఇక్కడ ఉన్న




కొండపల్లే ఏర్పడింది. కొండ క్రింద తేజో లింగం దేవాలయం ఉంది.

తేజోలింగా (జ్యోతిర్లింగం) నికి అంకిత మైన అరుణాచల దేవాలయం భారతదేశపు దక్షిణ భాగంలో చాలా పెద్దది. బ్రహ్మాండ మైన ప్రాకారాలతో పెద్ద ద్వారంతో దేవా లయం కొండను ఆనుకుని ఉంటుంది. 1000 స్తంభముల మంటపమ్ము, సింహద్వారం పైన సుమారు 200 అడుగుల ఎత్తైన 11 అంత ల గోపుర దేవాలయం మిక్కిలి గంభీ రంగా ఉంటుంది. నాలుగు దిక్కుల నాలుగు గాలిగోపురాలు ఉంటాయి. ఇచ్చట గాలిగోపురంలో ఒకదానిని 1560 లో శ్రీకృష్ణ దేవరాయలు కట్టించారని చరిత్ర. ఇది గొప్ప శైవక్షేత్రం. పంచభూత స్థలాలలో తిరువణ్ణా మలై ఒకటి. ఇక్కడ లింగం ప్రతి ష్ఠాపింపబడింది. దివ పవిత్రమైన అరుణాచలము.

నవంబరు డిసెంబరు మాసాలమధ్య వచ్చే పౌర్ణమిరోజున అంటే కార్తిక పౌర్ణమినాడు కార్తిక దీపోత్సవం అత్యంత వైభవంగా జరుగుతుంది. ఆనాడు కొండమీద పెద్ద దీపం వెలిగిస్తారు. కొండమీద పెట్టిన పెద్ద కంచు గిన్నెలో దేశ దేశాలనుంచీ వచ్చే భక్తులు కర్పూరం, నెయ్యి అర్పిస్తారు పెద్ద పెద్ద వత్తులు తయారుచేసి ఈ గిన్నెలో నానబెడ తారు. ఎండ వచ్చినా, వాన కురిసినా ఆ ముహూర్తానికి క్రింద బాణాసంచా కాల్చే సమయానికి సరిగా పైన ఉన్న దీపాన్ని వెలిగి స్తారు. ఈ దీపం కొన్ని రోజుల పాటు వెలుగుతుంది. దూరానికి కూడా ఎంతో కాంతిగా కనిపిస్తుంది.

కార్తిక దీపోత్సవం 10 రోజులపాటు జరుగుతుంది. అందంగా అలంకరించిన రథంకూడా లాగుతారు. తిరువణ్ణామలై రథం ప్రత్యేకమైన నిర్మాణానికి ప్రసిద్ధి పొందింది. మిక్కిలి పెద్ద రథం. కార్తిక దీపం రోజున 14 అంతస్థుల గోపురం

పూర్తిగా ఎలక్ట్రిక్ బల్బులతోను, చిన్నచిన్న ప్రమిదలలో వెలిగించిన నూనె దీపాలతోను వైభవోపేతంగా ఉంటుంది.

అణ్ణామలై నాథర్, ఉణ్ణామలై అమ్మైయార్‌ని పూజిస్తారు. దేవాలయంలో ఉన్న ఒక గోపురం పైనుంచి అరుణగిరి నాథర్ అనే భక్తుడు క్రిందికి దూకినప్పుడు సుబ్రహ్మణ్యస్వామి (మురుగదైవం - శివుని పుత్రుడు) చేతులతో పట్టుకుని రక్షించాడని ప్రతీతి. అప్పుడు అరుణగిరి నాథర్ ఆవేశంతో భక్తిపూరితమైన తిరుప్పుగళ్ పాటలు అనేకం రచించాడు.

అనేకమంది యోగులు, తాత్త్వికులు, భక్తులు, యాత్రికులు ఇక్కడ రమణాశ్రమాన్ని సందర్శిస్తారు. రమణ మహర్షి దర్శనార్థం అనేకమంది భక్తులు వచ్చి వారి చూపులతోనే అనుగ్రహం పొంది ఆనందిస్తూండేవారు. చాలామంది భక్తులు ఇక్కడ స్థిరనివాసాలు ఏర్పరచుకున్నారు. 'ఏ సెర్చ్ ఇన్ సీక్రెట్ ఇండియా' రచించిన పాల్ బ్రంటన్ అనే విదేశీ రమణభక్తుడు రమణాశ్రమంలో ఉండేవాడు. మరియొక రమణ భక్తుడు ఆర్థర్ ఆస్‌బర్న్ రమణాశ్రమంలో ఉండేవారు. స్త్రీ పురుషుల స్వేచ్ఛా జీవనం శ్రేయోదాయకం అని ప్రతిపాదిస్తూ తెలుగు సాహిత్యంలో విశిష్ట దీపకళికలు అని చెప్పుకో తగిన శశిరేఖ, దైవమిచ్చిన భార్య, మా కర్మమిట్లా కాలింది, కన్నీటి కాలువ, బ్రాహ్మణీకం, మైదానం, అమీనా మొదలైన నవలలు రచించిన గుడిపాటి వెంకటచలం కూడా చివరికి అణ్ణామలై రమణాశ్రమం చేరుకున్నారు. శ్రీ రమణ మహర్షి స్థాపించిన ఆశ్రమమే రమణాశ్రమం. రమణ మహర్షి తిరువణ్ణామలైలో నివసిస్తూ అక్కడే సమాధి పొందారు. దేవాలయం లోపల పాతాళ లింగం సన్నిధివద్ద రమణమహర్షులకు జ్ఞానోదయం కలిగింది. ఈనాడు ఈ పాతాళ లింగంగల గుహ దేవాలయం లోపల పవిత్ర స్థలంగా ఏర్పడింది.

తిరువణ్ణామలైలో గిరిప్రదక్షిణం చాలా ముఖ్యమైనది. 12 కి.మీ. ల రోడ్డుమీద

(మిగతా 26వ పేజీలో)

## భాస్వరం పుష్కలంగా లభించే "ఆపిల్" మెదడుకి బలాన్ని చేకూరుస్తుంది



సాధారణంగా భాస్వరం పుష్కలంగా లభించే పండ్లు మెదడుకి నీరసాన్ని తగ్గించి పుష్టిని చేకూరుస్తాయి. వాటిలో ఆపిల్ పండు ఒకటి. ఇది ఎక్కువగా యోచనాశక్తితో పనిచేసేవారికి ప్రకృతి ప్రసాదించిన వర ప్రసాదం. ధీశక్తిని పెంచదలచుకునేవారు రోజుకు 3 లేక 4 ఆపిల్ పళ్ళు తినండి.

—జి. ఎస్.

"తల్లి పిల్లవాడిని కనిపెట్టి చూస్తున్నట్టు

## డా॥ సి. పి. రామస్వామి అయ్యర్

రామస్వామి అయ్యరు తమిళనాడు వందవాసిలో నవంబరు 12, 1879 న దీపావళి పండుగ రోజున జన్మించాడు. సి. ఆర్. పట్టాభిరామయ్యర్, సీతాలక్ష్మి పుణ్యదంపతుల ఏకైక పుత్రుడు. ఇతడి తండ్రి పట్టాభి



Dr. C.P. RAMASWAMY AIYAR

రామయ్యర్ సుప్రసిద్ధ న్యాయవాది. ఇంగ్లీషు భాషలో గొప్ప పండితుడు.

ఇతడి విద్యాభ్యాసం వెస్లీ కాలేజీలో కొనసాగింది. తరువాత ఇతడు మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో గణిత శాస్త్రంలో ఉత్తమశ్రేణిలో పట్టభద్రుడయ్యాడు. న్యాయశాస్త్రంలో కూడా ఇతడు డిగ్రీని పొందాడు.

విద్యార్థిగా ఉంటున్నప్పుడే ఇతడు బైబిల్‌ను పూర్తిగా అధ్యయనించి, పాశ్చాత్య తత్త్వశాస్త్రంలో సమగ్ర పాండిత్యాన్ని సంపాదించాడు. ఆంగ్లంలో మిల్, డార్విన్, హక్స్‌లే, షాపెన్ హోవర్ మొదలైన సుప్రసిద్ధ తత్త్వవేత్తల రచనలను చదివాడు. ఎడ్విన్ ఆర్నాల్డ్ రచించిన 'లైట్ ఆఫ్ ఏషియా'ను పఠించి బౌద్ధతత్త్వాన్ని చక్కగా అవగాహన చేసుకున్నాడు. వివిధ శాస్త్రాలలో అనేక గ్రంథాలను మిక్కిలి శ్రద్ధగా చదివాడు.

న్యాయశాస్త్రంలో డిగ్రీని సంపాదించిన తరువాత రామస్వామి అయ్యర్ న్యాయవాదిగా వృత్తిని ప్రారంభించాడు. సుప్రసిద్ధ న్యాయవాదిగా పేరుపొందిన వి కృష్ణస్వామి అయ్యర్ వద్ద పని నేర్చుకోడానికి అప్రెంటిస్‌గా చేరాడు. 1903 లో స్వంతంగా ప్రాక్టీసు ప్రారంభించాడు. ఇయర్డ్లే నార్టన్ మరియు జె.ఎల్. రొజేరియో అనే సుప్రసిద్ధ న్యాయవాదుల ప్రభావంవల్ల ఇతడి మానసిక ప్రవృత్తిలో అమోఘమైన మార్పు సంభవించింది నార్టన్ లైబ్రరీలో ఇతడు వివిధ విషయాలపై అనేక గ్రంథాలను చదివి అపూర్వ పాండిత్యాన్ని సంపాదించాడు.

1907 వ సంవత్సరానికి రామస్వామి అయ్యర్ న్యాయవాది వృత్తిలో మంచి పేరును గడించాడు. పెద్ద పెద్ద పారిశ్రామిక సంస్థల తరపున, జమీందారుల తరపున కోర్టులో అతి నైపుణ్యంగా వాదించి అనేక మంది క్లయింటుల గౌరవ మర్యాదలను పొందాడు.

జిడ్డు కృష్ణమూర్తి గార్డియన్ షిప్ కేసులో వక్తృత్వంలో పేరుపొందిన స్వంతంగా వాదించు చుంటున్న డా. అనిబిసెంట్‌కు వ్యతిరేకంగా

కృష్ణమూర్తి తండ్రి పక్షం వహించి కోర్టులో వాక్చాతుర్యంతో అతి నైపుణ్యంగా వాదించి కేసు నెగ్గాడు. అనిబిసెంట్ ఇతడి వాక్పటుత్వానికి మెచ్చుకుని వేనోళ్ళ పొగిడి అనేక విధాలుగా సహాయం చేసింది.



రామస్వామి అయ్యర్ 'ఆషే' (Ashe) హత్య కేసును నిర్వహించాడు. వి. ఓ. చిదంబరంపిళ్ళై షిపింగ్ కంపెనీకి ఇతడు ఎంతో సహాయం చేసాడు. ప్రారంభించిన 10 సంవత్సరాలలోనే న్యాయవాద వృత్తిలో మంచి నైపుణ్యాన్ని సంపాదించాడు. అనేక మంది న్యాయాధికారుల మెప్పును, మర్యాదను పొందాడు.

రామస్వామి అయ్యర్ భారత స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నాడు. 1917-18 లో ఇతడు ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ సెక్రటరీగా పనిచేసాడు. బిసెంట్ చేపట్టిన రాజకీయ మరియు విద్యాసంబంధమైన కార్యక్రమాలలో పాల్గొన్నాడు. హోమ్ రూల్ లీగ్ మరియు నేషనల్ ఎడ్యుకేషన్ మూవ్‌మెంట్‌లతో సన్నిహిత సంబంధం ఏర్పరచుకున్నాడు. ఆనాడు వైస్రాయిగా ఉన్న మాంటేగ్ స్నేహాన్ని కలుపుకుని అనేక రాజకీయ సమస్యలకు భిన్నాభిప్రాయాలను నిర్భయంగా ప్రకటించాడు.

1920 లో రామస్వామి అయ్యర్ మద్రాసు రాజధానిలో జస్టిస్ పార్టీకి వ్యతిరేకంగా ఎన్నికలలో పాల్గొన్నాడు. ఎన్నికలలో నెగ్గాడు. ఇంతలో ఇతడు మద్రాసు అడ్వొకేట్ జనరల్‌గా నియమితుడైనాడు 1923 లో మద్రాసు గవర్నరు లార్డ్ విల్లింగ్‌డన్ మద్రాసు ఎక్జిక్యూటివ్ కౌన్సిల్‌కి ఇతడిని సభ్యుడిగా నియమించాడు.

ఎగ్జిక్యూటివ్ కౌన్సిలర్‌గా రామస్వామి అయ్యరు మెట్టూరు, భవాని, పైకారా నీటిపారుదల మరియు విద్యుచ్ఛక్తి సరఫరా పథకాలను అమలులోకి తీసుకు వచ్చాడు కొచ్చిన్, విశాఖపట్టణం మరియు టూటికోరిన్ రేవుపట్టణాల అభివృద్ధి పథకాలను ఏర్పరచాడు. 1928 వరకు మద్రాసు ఎగ్జిక్యూటివ్ కౌన్సిలర్ పదవిలో ఉన్నాడు. 1926-27 లో భారతదేశపు ప్రతినిధిగా లీగ్ అఫ్ నేషన్స్, జెనీవాకు పంపబడ్డాడు.

## శిలాజంగా రూపొందిన మానవుని పుర్రె

మధ్యప్రదేశ్ నర్మదా లోయలో త్రవ్వుతూండగా అరుణ్ సోనాకియా అనే భూగర్భ పరిశోధకుడు, శిలాజంగా మారిన ఒక మానవుని పుర్రెను కనుగొన్నారు. దీనికి 'నర్మద మానవుడు' అని పేరు పెట్టాడు. ఇది ప్రాచీన శిలాయుగంలో నివసించిన చైనా మనిషి, జావా జాతి మనిషికంటె వేరుగా ఉన్నట్లు పరిశోధనవల్ల తేలింది.

"ప్రతిభా సామర్థ్యాలు శక్తి, వివేకోపాయాలు వేరు."

1931-32 లో కేంద్ర పాలకవర్గంలో లా, కామర్సు, రైల్వేలు మరియు సమాచార సంబంధమైన విషయాలకు సభ్యుడిగా చేర్చుకోబడ్డాడు.

1931 నుండి 1935 వరకు చట్టసంబంధమైన మరియు పరిపాలనా సంబంధమైన విషయాలలో ట్రావెన్కూర్ మహారాజాకు (ఇప్పుడు కేరళలో ఉంది) సలహాదారుడుగా నియమింపబడ్డాడు. 1936 లో ట్రావెన్కూర్ దివానుగా నియమింపబడ్డాడు. 1947 వరకు గౌరవప్రదమైన ఆ పదవిలో ఉన్నాడు. దివానుగా ఇతడు ట్రావెన్కూర్ రాష్ట్రాన్ని అధునాతనం చేసాడు. భారతదేశంలో ట్రావెన్కూర్ ఒక ఆదర్శ ఆస్థానంగా పేరు పొందింది.

ఎరువులు, రసాయనిక పదార్థాలు, రెయాన్, సిమెంట్, అల్యూమినియమ్ ఫాక్టరీలను స్థాపించి పరిశ్రమలను అభివృద్ధి చేసాడు. మెరైన్ బయోలాజికల్ ఇన్‌స్టిట్యూట్‌ను స్థాపించాడు. తిరువనంతపురం ఆర్ట్ గాలరీని అభివృద్ధి చేసాడు. ట్రావెన్కూర్ యూనివర్శిటీని ఏర్పరచాడు. భారతదేశంలో మొట్టమొదటి ఎరువుల కర్మాగారాన్ని ప్రారంభించాడు. పాచిపరా జల విద్యుత్ పథకాన్ని అమలులో పెట్టాడు. పెరియార్ గేమ్ సాంక్చుయిరీని స్థాపించాడు. పల్లివాసల్ జలవిద్యుత్ పథకాన్ని అభివృద్ధి చేసాడు. భారతదేశంలో పరిశ్రమలమీద కోటిరూపాయలు వెచ్చించిన మొట్టమొదటి సంస్థానం ట్రావెన్కూరు.

పవిత్ర హిందూ దేవాలయాలలో హరిజనులకు ప్రవేశం కల్పించిన మొట్టమొదటి వ్యక్తి ఇతడే. ఇతడు ఉరిశిక్షను రద్దు చేసాడు. భూమి పన్నులకు బదులుగా ఇతడు వ్యవసాయ ఆదాయపు పన్నును ప్రారంభించాడు. భారతదేశంలో తిరువనంతపురం నుండి కన్యాకుమారి వరకు మొట్టమొదటి సిమెంటు కాంక్రీటు రోడ్లను నిర్మించిన మేధావి ఇతడే. బీద విద్యార్థులకు మధ్యాహ్న భోజన వసతి కల్పించిన మొట్టమొదటి

## 69.42 కారట్ డైమండ్ ఉంగరం 10,50,000 డాలర్లకు అమ్ముడైంది


RICHARD BURTON

న్యూయార్క్ (యుఎన్ఐ) కార్టియర్స్‌లో 69.42 కారట్ల డైమండ్ ఉంగరం 10,50,000 డాలర్లకు అమ్ముడయింది. వెంటనే దీనిని అక్టోబర్ 1969 లో రిచర్డ్ బర్టన్ అనే సినిమా నటునికి (అతని సతీమణి, నటి ఎలిజబెత్ టైలర్ కోసం) ...

వ్యక్తి ఇతడే. న్యాయవాదిగా ఉన్న అన్నా చాండీ అనే ఆమెను మహిళా జిల్లా జడ్జిగా నియమించాడు. ఈమె తరువాత మొట్ట మొదటి హైకోర్టు మహిళా జడ్జిగా నియమితురాలైంది.

రామస్వామి అయ్యర్‌కి పనులు శీఘ్రంగా జరగాలనే నియమంలో విశ్వాసం అధికం. ట్రావెన్కూరు రాష్ట్రంలో విద్యుత్ సౌకర్యం ఏర్పరచటం, రాష్ట్రమంతా మంచి తంతర రోడ్డు సౌకర్యం కలిగించడం, అనేక పరిశ్రమలు ఏర్పరచడం మహాద్భుతమైన అపూర్వ విషయం. ట్రావెన్కూరు రాష్ట్రం ఆర్థికంగా, సాంస్కృతికంగా ఎంతో ప్రగతిని పొందింది.

1947 లో విరోధులు హత్యాప్రయత్నం చేసినప్పుడు రామస్వామి అయ్యరు దివాను గిరిని వదిలి రాజకీయ విషయాలలో పాల్గొన కూడదని నిశ్చయించుకున్నాడు. భారత దేశానికి తీరని నష్టం ఏర్పడింది.

రామస్వామి అయ్యర్ మంచి వక్త. ఆత్మ దగ్గర నుంచి ఆంత్రోపాలజీ గోల్ఫ్ ఆట దగ్గర నుంచి గాంధీ తత్త్వందాకా అన్ని విషయాలమీద అనర్గళంగా మాట్లాడేవాడు. భారత చిత్రకారులను పోషించాడు. హిందూ దేవాలయాలు, మఠాలు వాటికి సంబంధించిన నిత్య పూజా వ్యవహారాలు పూర్తిగా తెలిసిన వాడు. అనేక ధర్మసంస్థలకు లక్షలు లక్షలు సొమ్ము దానం చేసాడు.

ఇతడి పథకాలు బ్రహ్మాండమైనవి. ఉత్తరాన గంగ బ్రహ్మపుత్రా నదులను దక్షిణాన కావేరితో చేర్చాలనే గొప్ప పథకాన్ని భారత ప్రభుత్వానికి సమర్పించాడు. అనేక ఉద్గ్రంథాలను రచించిన సాహితీవేత్త. డా. రామస్వామి అయ్యర్ సెప్టెంబరు 26, 1966 న మరణించాడు.

# అపూర్వ విషయాలు

## కెనెడియన్ నది అసలు కెనడా దగ్గర ఉండదు

'కెనెడియన్' నది న్యూమెక్సికోలో పుట్టి టెక్సాస్ మరియు ఓకహోమాగుండా ప్రవ



హిస్తూ ఆర్కాన్‌సాస్ (యునైటెడ్ స్టేట్స్‌లో) చేరుతుంది. అసలు ఆ నది కెనడా దరిదాపుల ప్రవహించదు.

• • •

## పిచ్చర్ ప్లాంట్

పిచ్చర్ (Pitcher) ప్లాంట్ ద్రాక్ష తీగలా ఉంటుంది. పొడుగుపాటి ఆకు [illegible] (పిచ్చర్)గా ఏర్పడతాయి. అందు [illegible] లను ఆకర్షిస్తుంది. అందులోపల ఉం [illegible] తేనెను తినడానికి ప్రయత్నించే కీటకా [illegible] లు దాన్ని (పిచ్చర్)లో పడిపోతా [illegible]

[illegible] లతో ఏది వింటున్నావో,

తాకుతు [illegible]

# సాంకేతిక, వైజ్ఞానిక రంగాలలో సాధనలు

## మొట్టమొదటి ట్రాన్స్ అట్లాంటిక్ టెలిగ్రాఫ్ కేబిల్

మొట్టమొదట విజయవంతంగా అట్లాంటిక్ సముద్రంమీదుగా టెలిగ్రాఫ్ కేబిల్ 1866 లో బ్రూనెల్ గ్రేట్ ఈస్టర్న్ సంస్థ పూర్తిచేసింది.

## కేంద్రనాడీ విధానం

ఆరోగ్యంగా ఉన్నప్పుడు, అనారోగ్యంగా ఉన్నప్పుడు కూడా శరీరంలో కేంద్రనాడీ విధానం పనిచేసే తీరుని విలియం కుల్లెన్ (1710-1790) వివరించాడు.

## షెల్ గ్రిప్

పెద్ద పెద్ద రోడ్లమీద రద్దీ ఎక్కువగా ఉండే జంక్షన్‌లవద్ద జారుడు లేకుండా ఉండడానికి 1968 లో షెల్ శాస్త్రజ్ఞులు ఇపాక్సి రెసిన్, బిట్యుమెన్, బాక్సైట్ కలిపి క్రొత్త మిశ్రమాన్ని తయారుచేసారు. రోడ్లమీద అపాయ నిరోధకచర్యలకు 'షెల్‌గ్రిప్' అనే ఈ మిశ్రమానికి మంచి ప్రసిద్ధి ఏర్పడింది.

## విండ్ టర్బైనులు

ప్రపంచంలో గాలితో తిరిగే విండ్ టర్బైన్‌లు యునైటెడ్ స్టేట్స్ కాలిఫోర్నియాలో అల్టామౌంట్ పాస్ దగ్గర అత్యధికంగా ఉన్నాయి. ఇక్కడ మొత్తం 26 మెగావాట్స్ విద్యుత్తును ఉత్పత్తిచేసే 75 టర్బైనులు 1985 లో స్కాట్లండ్‌కు చెందిన హోడెన్ గ్రూప్ నిర్మించింది.

## బెయిలీ బ్రిడ్జి

రెండవ ప్రపంచయుద్ధ (1939-45) సమయంలో సర్ డొనాల్డ్ బెయిలీ కనిపెట్టిన 'బెయిలీ బ్రిడ్జి' విధానం అభివృద్ధి పొందుతున్న దేశాలలో బాగా ప్రాచుర్యం పొందింది.

## ప్రపంచంలో మిక్కిలి పెద్ద గడ్డిజాతి మొక్క - వెదురు



ప్రపంచంలో గడ్డిజాతికి చెందిన మిక్కిలి పెద్ద మొక్క వెదురు. వెదురులో కొన్ని రకాలు 100 అడుగుల ఎత్తుగా కూడా పెరుగుతాయి. మొలాక్కా వెదురు ఒకే రోజులో రెండు అడుగులు పెరుగుతుంది. వెదురు కాగితం తయారీకి ఉపయోగపడుతుంది. వంటచెరకుగా వినియోగపడుతుంది. ఇండ్ల నిర్మాణానికి, కుర్చీలు, బల్లలు [illegible]గరికి, పాత్రలు చేసుకోడానికి, తెరచాప కొయ్యలు కూడా ఉపయోగపడుతుంది. చైనా హోటళ్ళలో చేసే వెదురు చిగుళ్ళ కూరగాయ చాలా రుచికరమైనది.

# పశ్చిమ బెర్లిన్

**1871** నుంచి 1945 వరకూ బెర్లిన్ జర్మనీకి రాజధాని నగరంగా ఉంది. రెండవ ప్రపంచ యుద్ధం తరువాత బెర్లిన్ తూర్పు బెర్లిన్, పశ్చిమ బెర్లిన్ అని రెండు భాగాలుగా విభజింపబడింది. రాజకీయంగా పశ్చిమ బెర్లిన్ జర్మన్ డెమోక్రాటిక్




రిపబ్లిక్ (తూర్పు జర్మనీ)లో 180 కి మీ.లు లోపలకు ఉన్న ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీ (పశ్చిమ జర్మనీ)కి చెందిన ద్వీపంగా పరిగణించబడేది. సుమారు 2 మిలియను మంది జనాభాతో 480 చ.కి.మీ.ల వైశాల్యం గల పశ్చిమ బెర్లిన్ ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీలో మిక్కిలి పెద్ద నగరం.

బెర్లిన్ 750 సంవత్సరాలనాటిది. కోల్న (Kolln) మరియు బెర్లిన్ పురపాలక సంఘాలు రెండూ ఒకదానితో ఒకటి చేరినట్టు 1237 సం. డాకుమెంట్లలో చెప్పబడింది. ఆ రోజులలో చిన్న గ్రామమైన బెర్లిన్ ప్రష్యాలో ప్రవహించే స్ప్రీ నదికి తూర్పు దిక్కు గటుమీద ఉండేది. 1400 సంవత్సరానికి ఇది ముఖ్యమైన పెద్ద పట్టణంగా రూపొందింది. మిక్కిలి పటిష్ఠవంతమైన ప్రష్య రాష్ట్రానికి బ్రాండన్‌బర్గ్ 'గ్రేట్ ఎలక్టారు'గా పేరుపొందిన ఫ్రెడరిక్ విలియం (1620-88) పునాదులు వేసాడు. క్రొత్తగా ఏర్పరచిన ప్రష్య రాజ్యానికి (1701)లో అతని కుమారుడు 1వ ఫ్రెడరిక్ మొదటి రాజుగా నియమింపబడ్డాడు. ఇతడు బెర్లిన్‌ని తన రాజ్యానికి రాజధానిగా చేసాడు.

బెర్లిన్ ముఖ్య పట్టణంగా 1871 లో జర్మన్ సామ్రాజ్యం ఏర్పడింది. 1910 నాటికి ఇచ్చటి జనాభా సుమారు 37.50,000. మొదటి ప్రపంచ యుద్ధంవల్ల దీని ప్రవృద్ధికి కొంత తాత్కాలిక అంతరాయం కలిగింది. 1920 లో గ్రేటర్ బెర్లిన్ ఏర్పడింది. ప్రష్యన్ - స్టేట్ కమ్యూనలైజేషన్ చట్ట ప్రకారం బెర్లిన్ నగరం చుట్టుపట్ల 7 పట్టణాలతోను, 59 గ్రామీణ జిల్లాలు, 27 ఎస్టేటులు బెర్లిన్‌కు చేర్చబడ్డాయి. 1920 మధ్యకాలం నాటికి బెర్లిన్ యూరప్‌లో మిక్కిలి పెద్ద పారిశ్రామిక కేంద్రంగా మారింది.

రెండవ ప్రపంచ యుద్ధ సమయం (1939 45) లో శత్రువులు బెర్లిన్ పరి

క్రమలపై బాంబులు పేల్చి నగరాన్ని పూర్తిగా ధ్వంసం చేసారు. యుద్ధపు చివరి రోజులలో బెర్లిన్‌ను పూర్తిగా రష్యా సైన్యం ఆక్రమించింది. అప్పుడు జనాభా 42,50,000 నుండి 27,50.000 కి పడిపోయిందని వారు తెలుసుకున్నారు.




శత్రుసైన్యాలు బెర్లిన్‌ని నాలుగు విభాగాలుగా విభజించారు. పశ్చిమ బెర్లిన్‌లో 3 విభాగాలు అమెరికన్ బ్రిటిష మరియు ఫ్రెంచి సైన్యాలు ఆధీనంలోకి వచ్చాయి. తూర్పు బెర్లిన్ రష్యనుల ఆధీనంలోకి వచ్చింది.

మొదటి ఒప్పందం ప్రకారం కొన్ని సంవత్సరాల తరువాత ఈ విభాగాలన్నీ బెర్లిన్‌కే చెందాలి. కానీ రష్యనులు ఆక్రమించిన తూర్పు బెర్లిన్ ఫోర్‌పవర్ అగ్రిమెంట్స్‌కు వ్యతిరేకంగా కమ్యూనిస్ట్ జర్మన్ డెమోక్రాటిక్ రిపబ్లిక్ (తూర్పు జర్మనీ)కి రాజధానిగా చేయబడింది. కాబట్టి శత్రువులు పశ్చిమ బెర్లిన్‌ను తూర్పు జర్మనీకి ఇవ్వకుండా తమ ఆధీనంలోనే ఉంచుకున్నారు.

1945 సంవత్సరం వరకు జర్మనీలో అనేక కళలకు, విజ్ఞానానికి, విద్యకి నిర్వివాదంగా బెర్లిన్ ముఖ్య కేంద్రంగా ఉండేది. ఇదే యూరప్ దేశానికి ముఖ్య పారిశ్రామిక (ఇంజనీరింగ్, ఎలక్ట్రానిక్స్, ఆహార మరియు పొగాకు) కేంద్రం కూడా. అంతేగాక చాలా మంది బ్యాంకు వర్తకులు, ఫిల్మ్ కంపెనీలు, ఫైనాన్షియల్ కంపెనీలు మొదలైనవన్నీ బెర్లిన్ నగరంలోనే ఉన్నాయి. రెండవ ప్రపంచ యుద్ధం తరువాత బెర్లిన్‌లో అనేక ప్రదేశాలు శిథిలావస్థలో ఉండిపోయాయి. కానీ అతి శీఘ్రంగానే పశ్చిమ విభాగాలు తిరిగి నిర్మింపబడ్డాయి. ప్రజాప్రభుత్వ విధానంతో పశ్చిమంలో పశ్చిమ బెర్లిన్ ఒక షో కేసు (ప్రదర్శన మందిరం)గా తయారైంది. ఈనాడు జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్‌కు చెందిన బెర్లిన్ నగరం యునైటెడ్ స్టేట్స్, బ్రిటన్ మరియు ఫ్రాన్స్‌ల అధికారంలో మూడు సెక్టారులుగా విభజింపబడింది. అయినా వాస్తవానికి జర్మన్ పాలనలోనే ఉంది. దీని పార్లమెంటుని హౌస్ ఆఫ్

## ప్రపంచంలో ఎక్కలి పెద్ద బ్యాంకు

చతుర్నోకులతో చదరంగ మాడడం

సరుల లక్షణాం

రిప్రజెంటేటివ్స్ అంటారు. దీని రాష్ట్రప్రభుత్వం 'సెనేట్' బెర్లిన్ మేయర్ పాలనలో ఉంటుంది.

బెర్లిన్ 1987 లో 750 వ వార్షికోత్సవాన్ని జరుపుకుంది. యునైటెడ్ స్టేట్స్ సహాయంతో పశ్చిమ బెర్లిన్ ఆర్థికస్థోమతను



SHOPPING CENTRE

పునఃసృష్టి చేసుకుంది. ఈనాడు ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీలో పశ్చిమ బెర్లిన్ మిక్కిలి పెద్ద పారిశ్రామిక కేంద్రం. 2100 పారిశ్రామిక సంస్థలలో 1,60,000 మంది ఉద్యోగస్థులు 40 బిలియన్ డి.ఎమ్. పైబడ్డ ఆదాయాన్ని సృష్టిస్తున్నారు. ఈ సంస్థలలో పెట్టుబడులు 2000 మిలియను డి.ఎమ్. దాటి ఉంటాయి.

బెర్లిన్‌లో ప్రైవేటు సంస్థగా ఉన్న సీమెన్స్ కంపెనీ జర్మనీలో ఎలక్ట్రానిక్ పరికరాలను తయారుచేస్తుంది. ఈ కంపెనీ పేరుమీద బెర్లిన్ నగరంలో ఒక జిల్లానే సీమెన్స్ స్టేడెట్‌గా చేసారు. పశ్చిమ బెర్లిన్‌లోని ఎలక్ట్రో పరిశ్రమలలో పని చేస్తున్న మొత్తం 57,000 మంది ఉద్యోగస్థులలో 20,000 మంది సీమెన్స్‌లో పని చేస్తున్నారు.

పశ్చిమ బెర్లిన్‌లోగల 180 పరిశోధక సంస్థలలో ఎంతోమంది పనిచేస్తారు. నగరంలో సాంకేతిక వైజ్ఞానిక సంస్థలలో ఇండస్ట్రియల్ రాబోటులు, ప్లాస్టిక్ వస్తువులు, మెడికల్ మరియు పరిసర సాంకేతిక శాస్త్ర సంబంధమైన పరికరాలే గాకుండా రేపటి ప్రపంచానికి అవసరమైన వస్తువులను ఎన్నిటినో తయారు చేస్తారు.

గ్లాస్ ఫైబర్ ఉత్పాదక రంగంలో పశ్చిమ బెర్లిన్ ప్రథమ స్థానాన్ని పొందుతుంది. ఒక్క సీమెన్స్‌గాక డప్పెబుండే పోస్ట్ (ది ఫెడరల్ పోస్టాఫీసు) ఈ రంగంలో ఎంతో ప్రగతి పథంలో ఉంది. మొత్తం 70 సెం.మీ.ల లోతుగా పశ్చిమ బెర్లిన్ నుంచి లోయర్ సాక్సన్ నగరం యుఎల్‌జెన్ Uelzen) వరకు 264 కి.మీ. గ్లాస్ ఫైబర్ కేబిల్స్ వేయబడ్డాయి.

హీన్జ్ హెర్‌మన్ కొర్లెప్ కాంప్లెక్స్ అంతరిక్షంలో రాబోట్లు ఆశిస్తుంది. ఇప్పుడు పశ్చిమ జర్మనీలో సాంకేతిక వైజ్ఞానిక పరిశోధనల ఫలితంగా 2010 నాటికి చంద్రగోళంలో ఫాక్టరీలు నిర్మించవచ్చుని ఊహించబడుతూంది.

కళ మరియు వైజ్ఞానిక రంగాలలో పశ్చిమ బెర్లిన్ పాత్ర మిక్కిలి అద్భుతమైనది. నగరంలో 17 థియేటర్లు ఉన్నాయి. పురాణగాథలు, నాటకాలు ఇక్కడ ప్రదర్శించబడతాయి. పశ్చిమ జర్మనీలో ప్రపంచ ప్రసిద్ధి పొందిన నాటకాలు ప్రదర్శింపబడతాయి. వీటిలో అనేకమంది గొప్ప గొప్ప గాయకులు పాడతారు. ప్రత్యేక ఆర్కెస్ట్రాలు ఏర్పాటు చేయబడుతాయి. బెర్లిన్‌లోగల

"తన విలువ తనకు తెలియనివాడికి ఇతరుల విలువకూడా తెలియదు."

మొత్తం 2,000 చిత్రకారులకు, శిల్పులకు క్రొత్త క్రొత్త భావాలు పుట్టుకు వస్తూంటాయి. ప్రగతి పూర్వకమైన శిల్ప సౌందర్యంతో పశ్చిమ బెర్లిన్‌లో మ్యూజియంలు అనేకమందిని ఆకర్షిస్తాయి. నగరంలో వివిధ విద్యా సౌకర్యాలు ఉన్నాయి. ఇచ్చటి 'ఫ్రీ యూనివర్శిటీ' పశ్చిమ జర్మనీలో మూడవ పెద్ద ఉన్నత విద్యాసంస్థ.

న్యూక్లియర్ పరిశోధనకు హాన్-మీట్‌నర్ (Hahn-Meitner) వంటి ప్రత్యేక పరిశోధక సంస్థలు ఉన్నాయి.

ఈనాడు పశ్చిమ జర్మనీలో 1,00,000 విదేశీ పనివారు ఉన్నారు. ఇంకా వారి పోషణలో ఉన్నవారు, విదేశీ విద్యార్థులు, వ్యాపారస్థులు చాలా మంది ఉన్నారు. పశ్చిమ బెర్లిన్‌లో నివసిస్తున్న నాన్ జర్మనులు నగరంలో మొత్తం జనాభాలో 9 శాతం పైబడి ఉంటారు.

పశ్చిమ బెర్లిన్ వ్యాపారం 80 శాతానికి పైబడి ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీతో కొనసాగుతుంది. ఇతర దేశాలతో వ్యాపారం 5 శాతం. పశ్చిమ బెర్లిన్‌లో తయారైన వస్తువులు సుమారు 130 దేశాలకు ఎగుమతి అవుతున్నాయి. వీటిలో నాలుగింట మూడు వంతులు ముఖ్యమైన కాపిటల్ గూడ్సు. అభివృద్ధిపొందుతూన్న దేశాలతో పశ్చిమ బెర్లిన్‌కి వాణిజ్యంలో సంబంధ బాంధవ్యాలు ఉన్నాయి.

వ్యవసాయ మరియు ఆహార పరిశ్రమాభివృద్ధికి ప్రతి సంవత్సరం ప. జర్మనీలో జనవరి మాసంలో జరిగే 'అంతర్జాతీయ హరిత సప్తాహం' (International Green Week) ప్రపంచంలో పైనది. సుమారు 4,50,000 మంది పాల్గొనే ఈ ప్రదర్శన యూరోపియన్ మార్కెట్‌కి గేట్‌వే అని చెప్పవచ్చు.

చుట్టూ పెద్ద పెద్ద నీటివసతి ప్రదేశాలతో ప. జర్మనీ సస్యశ్యామలంగా ఉంటుంది. నగరం రోజంతా చాలా హడావిడిగా ఉంటుంది. 4,500 హోటళ్ళు ఉన్నాయి. 60 రాక్ మరియు జాజ్ కేంద్రాలు ఉన్నాయి. పశ్చిమ బెర్లిన్ మొదటి రకం విలాసనగరంగా పేరు పొందింది.

## శ్రీరామకృష్ణునివచనామృతము



SRI RAMAKRISHNA

• కాయ పెరిగి వక్కటి పండుగ పండిన వెంటనే పుష్పరేకలు వాటంతటవే రాలిపోతాయి. అట్లే మానవునిలో దివ్యాంశ పెరిగిన కొద్దీ మానవుని దౌర్బల్యమైన దోషాలు వాటంతట అవే నశిస్తాయి.

• సాధారణ మనుష్యులు మతాన్ని గురించి అధికంగా మాట్లాడతారు. వివేకవంతుడు మితభాషైన జీవితం ధర్మసమ్మతమై ఉంటుంది.

• భగవంతుడు ఒక్కడే విశ్వసత్యము. దీనిని గ్రహించి చెప్పు

'విగ్రహాలను, ప్రతిమలను పూజించేవారు వాటిని

# తమిళ సంస్కృతి

కళ్యాణి ముఖర్జీ

తమిళ సంస్కృతి అతిప్రాచీనమైనది.

అనేక శతాబ్దాలకు పూర్వమే తమిళ సంస్కృతి ఎంతో ఉచ్ఛస్థితిని పొందింది. క్రీస్తుశకం ప్రారంభానికి ముందే ప్రాచీన



TIRUVALLUVAR

తమిళుల నాగరికత మిక్కిలి పటిష్టవంతమై బహుముఖంగా వ్యాపించింది.

'ప్రపంచమంతా ఒక్కటే అందరూ నా స్నేహితులే' అనే విశ్వైక సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తూ తిరువళ్ళువర్ రచించిన తిరుక్కురళ్ ప్రపంచంలో అత్యుత్తమమైన సాహిత్య ప్రక్రియ అని చెప్పవచ్చు తమిళ వాఙ్మయాన్ని సుసంపన్నం మొనరించిన సాహితీమూర్తులలో తిరువళ్ళువర్ ప్రముఖుడు. ఇతడు రచించిన తిరుక్కురళ్ తమిళ వేదమని పేరు గడించింది. నీతిబోధకమైన ఈ గ్రంథం సార్వకాలికము, సార్వలౌకికము. పవిత్రమైన చిన్న చిన్న పద్యాలు "కురళ్". ఇందులో ధర్మార్థకామమోక్షాలకు సంబంధించిన విషయాలు వివరింపబడ్డాయి "ప్రేమ, దాతృత్వగుణం, కృతజ్ఞత, ఆత్మ విగ్రహం కలిగి ఉండాలి. భౌతిక సుఖాలు, సంపదలు శాశ్వతం కావు. మానవుల కష్టాలన్నిటికి కామ క్రోధ మోహాలు ముఖ్య కారణాలు. వీటిని వదిలినప్పుడే మానవుడు కష్టాలనుండి బయటపడగలడని" తిరుక్కురళ్ చెబుతుంది.

తిరువళ్ళువర్ ఆశించిన మానవ ధర్మాలు 'పెర్మన్ ఆన్ ది మౌంట్'లో కనిపిస్తాయి. మానవులంతా సమానులే అన్న సిద్ధాంతం 'అమెరికన్ డిక్లరేషన్ ఆఫ్ ఇండిపెండెన్స్'లో ఉంది

చిరస్మరణీయమైన అనేక గ్రంథాలు రచించిన అవ్వైయార్ తన జీవితాన్ని వ్యక్తిగత శీలాభివృద్ధికి, ధర్మప్రవృద్ధి ప్రచారానికి అంకితం చేసింది. ఈమె రచనలు సామాజిక జీవనానికి దర్పణం వంటివి.

ఇలంగో అడిగల్ రచించిన శిలప్పధికారం (కడియం కథ) ఒక మహాద్భుత

(16వ పేజీ తరువాయి)

శక్తులు పెద్ద కొండచుట్టూ తిరిగి రావచ్చు చుట్టుపట్ల అనేక పవిత్ర తీర్థాలు ఉన్నాయి కార్తీక దీపం ఉత్సవం స్త్రీలకు, పిల్లలకు చాలా ముఖ్యమైనది. ప్రతి ఇంట్లో కూడా మనం దీపావళికి దీపాలు పెట్టుకున్నట్టే దీపాలు పెట్టుకుంటారు. ఊరంతా దీపాలతో కళకళలాడుతూ ఉంటుంది.

''జీవాత్మ పరమాత్మల సంబంధం పండు దాని రుచి, అగ్ని దాని దహనశక్తి, పాలు దాని తెలుపు సంబంధం.

కావ్యం. తమిళుల భావ ప్రపంచంలో రామాయణంతో సాటివచ్చే గ్రంథమిది. ఇది కోవలన్ మరియు కణ్ణగి వృత్తాంతము. నిత్య జీవితంలో పరమ సత్యాలు ఇందులో వివరింపబడ్డాయి. స్త్రీ జాతి మహోన్నతిని చాటి చెప్పిన మొట్టమొదటి కావ్యం.

సీతలై సాత్తనార్ రచించిన 'మణిమేఖలై' అనే గ్రంథం బౌద్ధమత ప్రబోధకం. లౌకికమైన దుఃఖాన్ని అధిగమించేందుకు వైరాగ్యమే మార్గమని బౌద్ధుల ఆదర్శాన్ని ఈ గ్రంథం వివరిస్తుంది.



AVVAIYAR

బుద్బుదప్రాయమైన మానవ జీవితం, మానవ శరీరం, యౌవ్వనం, సుఖం, సంపద మొదలగు విషయాలు, దొంగతనం, హత్య, మోహంవల్ల మానవులకు సంభవించే అనర్థాలు అతి విపులంగా వర్ణింపబడ్డాయి.

'ఎట్టుతొగై' అనే అష్టగేయ బంధాలలో మానవ జీవిత విధానం, వ్యాపారాభివృద్ధి నిర్వహణ వంటి అనేక విషయాలు విశదీకరింపబడ్డాయి. ఎట్టుతొగై (అష్టగేయ బంధాలు) పత్తుపాట్టు (పదిపాటలు) చేర్చి 'సంగవాఙ్మయం' అంటారు. పైన వివరించిన ఇతిహాసయుగం తరువాత ఉజ్వ భక్తి ఉద్యమానికి చెందిన ఆళ్వారుల నాయన్మారుల యుగం ప్రారంభమైంది. తమిళభాష వ్యవహారభాషతో అన్వయం పొందింది. భక్తకవులైన పెరియాళ్వార్, నమ్మాళ్వార్, అప్పర్, మాణిక్కవాచకర్ తమిళభాషను పునరుజ్జీవింపజేసారు.



**Subramanya Bharati**

ఇటీవలి కాలంలో సుబ్రహ్మణ్య భారతి ఉద్భవించి రెండువేల సంవత్సరాల నాటి మహత్తర సాంప్రదాయాన్ని విడువకుండా సజీవమైన సాహిత్య సంస్కారంతో

## విదేశీయులకు 42 శాతం పేటెంట్లు

1984 సం.లో యుఎస్ పేటెంట్ అండ్ ట్రేడ్ మార్క్ ఆఫీసు వారు ఇచ్చిన 72,651 పేటెంట్లలో 42 శాతం విదేశాలలో నూతన వస్తు ఉత్పత్తిదారులకు ఇచ్చారు. 11,600 మంది జపానీయులకు, 6,403 పశ్చిమ జర్మనులకు ఇవి లభించాయి.

**నిషేధం గ్రహిస్తే విధిని గుర్తించినట్లే**

పాశ్చాత్య ప్రభావంతో, వన్య వాఙ్మయాన్ని సృష్టించారు. నూతన తమిళ కవిత్వంలో దేశభక్తిగీతాలు ప్రారంభమైనాయి. తమిళ దేశ సాహిత్య సౌందర్యం ప్రతిబింబించింది. సుప్రసిద్ధ కవి నామక్కల్ రామలింగం పిళ్లై గాంధీ అనుచరుడు. ఇతడు రచించిన




జాతీయ గీతాలు సువర్ణాక్షర లిఖితాలై ఆచంద్రార్కం మారుమ్రోగుతుంటాయి.

న్యాయము, ధర్మము, నీతి, కనికరము, దాతృత్వం, శౌర్యం వంటి సద్గుణాలతో ఎంతో ప్రవృద్ధిని. ప్రగతిని పొందిన జీవనమే తమిళ సాంఘిక జీవనం. వీరి సంస్కృతి మిక్కిలి గొప్పది.

తమిళ నాయకుడైన 'పారి' నేలపై ప్రాకుతూన్న మల్లెతీగకు తన రథాన్నే ఆధారంగా పెట్టి కాలినడకతో రాజ్యం చేరాడు. పాగాన్ అనే మరో తమిళ నాయకుడు చలిలో గడగడ వణుకుతూన్న నెమలికి తన శాలువను కప్పాడు.

శిబి చక్రవర్తి డేగకు తన మాంసాన్ని ఇచ్చి పావురాన్ని రక్షించాడు. మనునీతి చోళరాజు కుమారుడు ఒక ఆవుదూడపై ప్రమాదవశాత్తు రథం పోనిచ్చి చంపినందుకు గోమాత విచారిస్తూంటే రాజు తన కుమారునిపై రథం పోనిచ్చి చంపాడు. రాజు దర్బారులో తన భర్త దోషి కాదని కణ్ణగి రుజువు చేసినప్పుడు నెడుంజెళియన్ రాజు గుండె ఆగి మరణించాడు.

**క్విజ్ జవాబులు:**

1. (సి) మధ్యప్రదేశ్, 2. (డి) నైజీరియా, 3. (సి) బెంగాల్ గెజిట్, 4. (ఎ) చార్లెస్ డికెన్స్, 5. (సి) హర్షుడు, 6. (ఎ) అధ్యక్షుడు, 7 (ఎ) డాప్పింగ్, 8. (డి) ఎక్స్ట్రైజ్ డ్యూటీ (దేశంలో తయారైన వస్తువులమీద విధించే పన్ను. ఉత్పాదక స్థానంలో దీనిని వసూలు చేస్తారు.)

**తెలివికి పరీక్ష జవాబులు:** 1. (ఎ) శంకరాచార్యులు, (బి) రామానుజాచార్యులు, (సి) మధ్వాచార్యులు (డి) వల్లభాచార్యులు, 2. మధ్వాచార్యులు, జీవాత్మ [illegible] మధ్య తేడా, 4. [illegible] ప్రయాణించి పోగరాదు, 5. కుక్క గొడుగు, 6. శోకలేకుండా [illegible]

'తల్లి బిడ్డలను ప్రేమించడంకన్నా భగవంతుడు

# భగవద్గీత

భగవంతుడైన శ్రీకృష్ణునిచేత గానం చేయ బడింది భగవద్గీత. భగవద్గీత భారతీయు లకు పరమ పూజ్యమైన ప్రమాణ గ్రంథం. ఇది ఒక అపూర్వమైన, ఆధ్యాత్మిక కావ్య గానం. భగవంతునిచేత ప్రగీతమైనది కాబట్టి దీనిని భగవద్గీత అన్నారు. సంసార తాప త్రయాలను పోగొడుతుంది కాబట్టి దీనిని ఉపనిషత్తు అన్నారు. బ్రహ్మప్రాపకం




కావున దీనిని బ్రహ్మవిద్య అన్నారు. యోగాన్ని నిర్దేశిస్తుంది కాబట్టి దీనిని యోగశాస్త్రం అన్నారు. దీనితో సమానమైన గ్రంథం విశ్వసాహిత్యంలో ఇంకొకటి లేదు. ప్రపంచంలో బుద్బుదప్రాయమైన భౌతిక సుఖాలను త్యజించి భగవంతుని పాదపద్మా లను ఆశ్రయించమని గీత ఉద్బోధిస్తుంది. మూలగీత సంస్కృత భాషలో ఉంది. సంస్కృత పరిజ్ఞానంలేని సామాన్యులకు దీని అమూల్య సందేశం అందుబాటులో లేదు. అయినా దీని వ్యాప్తికి ఎంతమాత్రం ఆటంకం ఏర్పడలేదు. మహోత్కృష్టమైన గీతోపదేశం ఎందరెందరో ముముక్షువులను జిజ్ఞాసులను ఆకర్షించింది. ప్రపంచంలో ఉన్న ప్రముఖ భాషలన్నిటిలోకి అనువదింప బడింది. పండితులనుంచి పామరుల వరకూ గీతా సందేశం వ్యాపించింది, వ్యాపిస్తోంది, వ్యాపిస్తుంది. భగవద్గీతకు లభించినంత ప్రచా దరణ మరో గ్రంథానికి లభించలేదు.

ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, భగవద్గీత ఈ మూటిని ప్రస్థానత్రయం అంటారు. ప్రస్థానత్రయంలో చేరిన భగవద్గీత వ్యాసుల వారు 200 BC - 200 AD మధ్య ధర్మార్థ కామమోక్షాల సాధన గ్రంథంగా రచించిన 'జయ' అనే మహాభారతంలోని ఒక భాగం. పంచమ వేదం అనబడే మహాభారతం పద్దెనిమిది పర్వాల ఉద్గ్రంథం. పద్దెనిమిది పర్వాలలో ఒకటైన భీష్మ పర్వంలో ఉంది భగవద్గీత. భీష్మ పర్వంలో 25వ అధ్యాయం మొదలు 42వ అధ్యాయం వరకుగల 18 అధ్యాయాలలో భగవద్గీత పూర్తిగా చెప్ప బడింది. దీంట్లో 701 శ్లోకాలున్నాయి. మొత్తం మహాభారతంలో 24,000 శ్లోకాలు ఉన్నాయి. భారత ఇతిహాసంలో కౌరవులకు, పాండవులకు మధ్య కురుక్షేత్ర మహాయుద్ధం ప్రారంభంలో యుద్ధభూమిపై శ్రీకృష్ణభగ వానుడు అర్జునునకు చేసిన ఉపదేశమిది. ఇందులో వచ్చే ముఖ్యపాత్రలు నాలుగు ధృతరాష్ట్రుడు, సంజయుడు, అర్జునుడు, శ్రీకృష్ణుడు. ఒకే ఒక శ్లోకం ధృతరాష్ట్రుడు చెబుతాడు. సంజయుడు 41 శ్లోకాలు, అర్జునుడు 85 శ్లోకాలు చెబుతారు. మిగిలిన 574 శ్లోకాలు శ్రీకృష్ణుని ఉపదేశం. ఆవేశ

''భుజబలం, బుద్ధిబలం, ధనబలం ఇవేవీ

పూరితంగా చెప్పిన గీతలో భావాలు తిరిగి తిరిగి చెప్పడం మానవులు గీతోపదేశాలను సులభంగా గ్రహించడానికే - మానవుడు ప్రతినిత్యం ఎదుర్కొంటూన్న సమస్యలకు పరిష్కార మార్గమే భగవద్గీత. తాపత్రయాలతో నిరాశతో కూలబడిన మానవునికి ప్రోత్సాహం, ఆశ, ఉల్లాసం, ఓదార్పు కలిగిస్తుంది గీత. 'నీ ప్రకృతిని మార్చుకో. దివ్యత్వాన్ని సాధించు' అని ఉద్బోధిస్తుంది గీత. ప్రాపంచిక కార్యకలాపాలను కొనసాగించుకుంటూ మానవుడు పరమాత్మతో ఐక్యాన్ని సాధించవచ్చు అనేదే గీతముఖ్యోపదేశం. త్యాగం, భూతదయ, ప్రేమ, విధి నిర్వహణ ఇందులో ముఖ్యాంశాలు. రాగద్వేషాలకు అతీతుడుగా ఉంటూ స్వార్థం, కామం, దురాశ, గర్వం, దర్పం మొదలైన దుర్గుణాలను తొలగొట్టుకుని హృదయాన్ని నిష్కల్మషం చేసుకోమంటుంది గీత. ముఖ్యంగా "చేయవలసినవని చేయడం నీ వంతు. దాని ఫలితం సంగతి నాకు వదిలిపెట్టు" అని శ్రీ కృష్ణుడు ఉద్బోధిస్తాడు.

మొదటి అధ్యాయం అర్జునుని విషాదం. దానికి శ్రీకృష్ణుడు దుఃఖింప తగని వారిని గురించి అనవసరంగా దుఃఖపడుతున్నావు. ఇది నీచమైన హృదయ దౌర్బల్యం సుమా! అని హెచ్చరిస్తాడు.

రెండవ అధ్యాయం సాంఖ్యయోగం. జీవ స్వరూప వర్ణన, సాంఖ్యరూపానుగుణ్యమైన ఉపదేశం. కర్మయోగం, స్థితప్రజ్ఞుని లక్షణాలు వివరింపబడ్డాయి.

మూడవ అధ్యాయం కర్మయోగం. విధ్యుక్తమైన కర్మచేయకుండా ఉండడం కంటే జీవితాంతం చేయవలసిన కర్మలను ఆచరించాలని ప్రతిపాదింపబడింది. ఇందులో ముఖ్యంగా కర్మ అనివార్యం అని చెప్పబడింది.

నాల్గవదైన జ్ఞానయోగంలో కర్మయోగం ప్రాచీనత, అవతార తత్త్వము వివరించి, కోర్కెలననుసరించి ఫలితం ఉంటుందంటూ జ్ఞానయోగం యొక్క శ్రేష్ఠత్వం విపులంగా చెప్పబడింది.

సన్యాసయోగం అయిదవది. ఇందులో

## యురేనస్ గ్రహంలో కొన్ని భాగాలు అల్ట్రావయొలెట్ కాంతిని ప్రసరిస్తున్నాయి



భూమికి రెండు బిలియన్ మైళ్ళ దూరంలో వాయేజర్ 2 స్పేస్‌క్రాఫ్ట్ తీసిన ఫోటోలు యురేనస్ గ్రహం చీకటివైపు [భూమికి ఉత్తర దక్షిణకాంతుల (లైట్సు) లాగే] అరోరా కాంతులు ఉన్నాయని తెలియజేస్తున్నాయి. యురేనస్‌లో కొన్ని భాగాలు అల్ట్రావయొలెట్ కాంతిని ప్రసరిస్తున్నాయని తెలుసుకున్నారు. యురేనస్‌మీద రోజు పరిమాణం సుమారు 18 గంటల 48 నిమిషాలని వాయేజర్ తెలియజేసింది.

"జాగ్రత్త అంటే కనువిప్పు కలిగి కాలానుగుణంగా మేలు పొందడం,

కర్మయోగి లక్షణాలు కామ క్రోధ వేగాన్ని సహించడమే సుఖోపాయము అని చెప్పబడింది. ఈ విధంగా ధ్యాన, జ్ఞాన, అక్షర బ్రహ్మరాజ మొదలైన 18 యోగాలు 18 అధ్యాయాలలో వివరింపబడ్డాయి. మొదటి ఆరు అధ్యాయాలు ఆత్మను గురించి చెబుతున్నాయి. వీటిని కర్మషట్కం అంటారు. తరువాతి ఆరు అధ్యాయాలు భక్తిషట్కము ఉపాస్యుడైన పరమాత్మను గురించి వర్ణిస్తున్నాయి చివరి ఆరు అధ్యాయాలలో మోక్షోపాయం వర్ణింపబడింది. దీనినే జ్ఞానషట్కం అంటారు. చివరి 18వ అధ్యాయం గీత కంతటికి ఉపసంహారం.

శ్రీకృష్ణుడు అర్జునునికి ఉపదేశించిన ఈ దివ్యయోగం తాత్కాలికంగా యుద్ధభూమిపై పనికి వచ్చేదేగాక సృష్టి ఉన్నంత కాలం మానవులందరికి ఉపకరిస్తుంది. అభేద దృష్టి, భేదదృష్టి, ద్వైతదృష్టి అనే మూడు విధాల ఉపాసనాలు గీతలో వివరింపబడ్డాయి. దేహాభిమానం ఉన్నవారికి ద్వైతదృష్టి, కొంచెం చిత్తనైర్మల్యం పొందినవారికి భేదదృష్టి, పరిపక్వత నొందినవారికి అభేద దృష్టి కలుగుతుంది. కాబట్టి ద్వైత, విశిష్టాద్వైత, మధ్వ మతాలు మూడు సత్యమే అనీ, అవి పరస్పర సహకారాలుగా ప్రవృద్ధి పొందాలి అని మనం గ్రహించాలి. నన్నయ, తిక్కన, ఎర్రన వ్యాస మహాభారతాన్ని తెలుగులోకి అనువదించారు. భారతం 18 పర్వాలలో ఆదిపర్వం , సభాపర్వం,అరణ్య పర్వంలో సగం వ్రాసి నన్నయ గతించాడు. తరువాత తిక్కన నాల్గవ పర్వం, చివరిదాకా మిగిలిన పర్వాలు తెలుగులో వ్రాసాడు. మిగిలిపోయిన అరణ్యపర్వ భాగం ఎర్రన పూర్తి చేసాడు. ఈ విధంగా భారతాంధ్రీకరణ పూర్తి అయినా భీష్మపర్వంలో ఉన్న భగవద్గీతను వీరెవరూ ముట్టుకోలేదు. ఎందుకో?

ఆధ్యాత్మిక తత్త్వవిషయమై ప్రశ్నోత్తర రూపంలో ఉద్ధవగీత, గోపికాగీత, భ్రమర గీత, పాండవగీత, రామగీత, శివగీత, వేణుగీత, ఉత్తరగీత అని గీతలు అనేకం ఉన్నాయి. కానీ ప్రపంచ ప్రశస్తి పొందిన శ్రీమద్భగవద్గీత వంటి ఆధ్యాత్మిక గ్రంథం విశ్వసాహిత్యంలో ఇంకొకటి కనపడదు. నిత్యజీవితంలో అర్థంచేసుకుంటూ అందరూ ప్రతీరోజూ చదవవలసిన అపూర్వ గ్రంథం. భగవద్గీత ప్రచారానికి కాదు ఆచరణకే అని గుర్తించాలి.

— తాడూరి.

## ఆదర్శాలు నక్షత్రాలు వంటివి



ఊహా ప్రపంచంలో ఆదర్శాలు ఆకాశంలో నక్షత్రాలు లాంటివి. ఆదర్శాలను విజయవంతం చేసుకోడం సులభ సాధ్యం కాదు. నీటిమీద ప్రయాణీకుడు దారి తెలియని మహాసముద్రం మీద ఉన్నట్టు ఆదర్శాలు మార్గదర్శకంగా మాత్రమే ఉంటాయి. పట్టుదలతో వాటిని అనుసరిస్తేనే గమ్యం చేరుకుంటావు. — కార్ల్ షుర్జ్

## వర్షపుటడవులు అంతరించిపోయే భయంకర పరిస్థితులు

ప్రపంచం మొత్తంమీద వర్షపుటడవులు సంవత్సరానికి 15 మిలియను హెక్టేరుల చొప్పున అతి భయంకరంగా అంతరించి పోతున్నాయి. ప్రపంచంలో ఉండే 10 మిలి



యను వివిధ మొక్కల జాతులలో సగానికి సగం పెరుగుతూన్న ఈ అడవులను ఇదే విధంగా నశింపజేస్తూంటే 2000 సంవత్స రానికి అసలు ఈ వర్షపు టడవులు మచ్చుకు కూడా కనిపించవు.

—పీడ్.'ఎడిటర్ ఆఫ్ ది వరల్డ్ రెయిన్ ఫారెస్ట్ రిపోర్ట్' సౌజన్యంతో

## హంగేరియన్ భాషలో భగవద్గీత

భగవద్గీత హంగేరియన్ భాషలోకి వచన రూపంగా అనువదింపబడింది. హంగేరియన్ పండితుడైన జాజ్సెఫ్ వెకెర్డీ సంస్కృ తంలో ఉన్న భగవద్గీతను హంగేరియన్ గద్యలోకి అనువదించాడు. హంగేరియన్ పాఠకులకు ఈ గ్రంథం భారతీయ తత్త్వాన్ని, ధర్మాన్ని మరియు భారత కథలను పరి చయం చేస్తుంది అనడంలో సందేహం లేదు.

## మూడవతరం రాబోట్

హిస్పానో సూయిజా అనే ఒక ఫ్రెంచి కంపెనీ ఐసిస్ (Isis) అనే మూడవతరం రాబోటును రూపొందించింది. ఇది న్యూక్లి యర్ రియాక్టర్ కోర్‌లోకి ప్రవేశించి అక్కడ దానిని పరీక్షించి రిపేరు చేయగలుగుతుంది. దీనికి అమర్చిన ఎలక్ట్రానిక్ హెడ్,కంట్రోల్ రూమ్‌లో పరిశోధకులకు వివరాలను అంద జేస్తుంది. ఈ రాబోట్ 11 మీటర్ల చెయ్యి అతి భద్రంగా, నైపుణ్యంగా పాత విడిభాగా లను తీసి కొత్తవాటిని అమరుస్తుంది.

## డేగ జాతికి చెందిన ఫాల్కన్

డేగ జాతికి చెందిన పెద్ద రెక్కలు కలిగిన ఫాల్కన్ సాధారణంగా పై నుంచి పక్షి ఆహారాన్ని కాళ్ళతో తన్నుకుపోతుంది. ఒక అరమైలు దూరంలో ఉన్న పురుగును కూడా అతి సామర్థ్యవంతంగా చూడగలదు. దీని కంటి దృష్టి చక్కని తీక్షణమైనది. ఎంత దూరంలో ఉన్న వస్తువులనైనా బాగా చూడ గలదు.

ద్మగంధముల్ మరగిన తేటులన్న

## 1500 సంవత్సరాలనాటి ప్రాచీన శవపేటికను కనుగొన్నారు.

దక్షిణ అమెరికా ఉత్తర పెరూలో సిపాన్ నగరంలో పురావస్తు శాస్త్రజ్ఞులు 1500 సంవత్సరాలనాటి ప్రాచీన శవపేటికను కనుగొన్నారు. ఈ శవపేటికలో రాజకీయ వారియర్ ప్రీస్టు అస్థిపంజరంతో పాటు ఇతర 7 మంది శరీరాలు, నగిషీలు చెక్కిన వెండి బంగారు వస్తువులు, రత్నాలు ఉన్నాయి.

## అధునాతన ఆప్టికల్ పరికరాలు అమర్చబడిన లైట్‌హౌస్

ఒరిస్సా పరదీప్ ఓడరేవు దగ్గర క్రొత్త వర్తులాకారపు RCC లైట్ టవర్‌తో కూడిన లైట్ హౌస్ రూ. 68 లక్షల వ్యయంతో నిర్మింపబడింది. దీనికి అధునాతనమైన కాంతిప్రసారక సాధనం అమర్చబడింది. దీని కాంతి తీవ్రత 1.1 మిలియను కాండిలాస్ (Candelas) ఉంటుంది. సగటు వాతావరణ పరిస్థితులలో దీని కాంతి 26 నాటికల్ మైళ్ల దూరంవరకూ కనిపిస్తుంది.

## బర్డ్ కౌంటర్!

ఒరిస్సాలో సుప్రసిద్ధ ఆర్నిథాలజిస్టు (పక్షుల పరిశోధకుడు) యు. ఎస్. దేవ్ కొత్తగా 'బర్డ్ కౌంటర్'ను కనిపెట్టాడు. ఇది పక్షులను రాండమ్ శాంప్లింగ్ విధానంలో లెక్కకడుతుంది. కటకములేని దూరదర్శిని

## తప్పుచేసి లాభం పొందాలంటే!



తప్పుచేయడం అందరికీ సహజమే. కానీ చేసిన తప్పుతో అందరూ లాభంపొందలేరు.

తప్పు చేశావా - తప్పు ఒప్పుకో. ఇంకొకరి తలమీద రుద్దడం మా కాదు. నీవుచేసిన తప్పును నీవు ఒప్పుకోకపోతే ఇంకోసారి తప్పు చేయడం తథ్యం దీనివల్ల లాభంలేదు.

నష్టాన్ని అంచనావేసుకో: నీవు చేసిన తప్పు ఎంతపెద్ద తప్పు: దానివల్ల ఏర్పడే పరిణామాలు ఏమిటి: ఆలోచించి తెలుసుకో. కారణాలను తెలుసుకో. నీవు వేసుకున్న ప్రణాళికా పథకం సరిగాలేదా: పర్యవేక్షణ సక్రమంగాలేదా: ఎవరైనా తప్పుడు సమాచారం అందచేశారా: ఇందులో తప్పు ఇంకెవరిదైనా ఉందా:

క్రొత్త ప్రణాళిక వేసుకో. దాని ప్రకారం ప్రారంభించు. ప్రారంభించిన దానిని

'గర్వం మానవుని పురోగతికి ఆటంకం,

వంటి గొట్టం ఒక చివర అశీకటకము, మరొక చివర వదరపు రంధ్రం ఉంటుంది

## కరవు ప్రదేశాలలో పండించడానికి అనువైన వరి

పైజాబాద్ (ఉత్తరప్రదేశ్)లో నరేంద్ర దేవ్ యూనివర్శిటీ ఆఫ్ అగ్రికల్చర్ అండ్ టెక్నాలజీలో 'IET 7613' అనే క్రొత్త రకం వరి అభివృద్ధి చేయబడింది. కరవు ప్రదేశాలలో నీటిపారుదల శ్రమ లేకుండా 85 రోజులలో హెక్టేరుకి 38 క్వింటాళ్ళు పండుతుంది. ఎరువులు పెట్టినకొద్దీ దిగుబడి అధికంగా ఉంటుంది.

## అమెరికన్ మహిళ నడకవేగం

యుఎస్ఎ ఫిలడల్ఫియాలో టెంపిల్ యూనివర్శిటీ మెడికల్ స్కూల్‌లో డా. రే ఫిన్‌లే అధ్యయనం చేసి సగటు అమెరికన్ మహిళ నడిచేటప్పుడు అంగ 63 సెంటీ మీటర్లని. భర్త అంగకంటే 10 సెంటీమీటర్లు తక్కువని తెలుసుకున్నారు. ఇప్పుడు అమెరికన్ వనిత చాలా త్వరగా నిమిషానికి 116 అడుగులు వేస్తూ మిలటరీ పెరేడ్ రిథమ్‌కు లయబద్ధంగా నడుస్తూందంటున్నారు వీరు.

—'ఉమన్స్‌డే' సౌజన్యంతో

## ఎలక్ట్రానిక్ టాక్సీ మీటర్లు ప్రవేశపెట్టిన మొదటి రాష్ట్రం

మొట్టమొదట మహారాష్ట్రలో ఎలక్ట్రానిక్ టాక్సీ మీటర్లను ప్రవేశపెట్టారు. బొంబాయి, పూనే, నాశిక్, థానే, కొల్హాపూర్‌లలో ఇది వాడుకలో ఉంది.

## 700 హెచ్‌పి డీసెల్ ఎలక్ట్రిక్ షంటింగ్ లోకోమోటివ్

"ది భారత్ హెవీ ఎలక్ట్రిక్ లిమిటెడ్" ఝాన్సీ విభాగంవారు 700 హెచ్‌పి డీసెల్ ఎలక్ట్రిక్ షంటింగ్ లోకో మోటివ్‌ను 'సింగిల్ పవర్ పేక్'గా అభివృద్ధి చేశారు. దేశీయ సాంకేతిక పరిజ్ఞానం, పరికరాలతో చేసిన ఈ లోకోమోటివ్ స్టీల్ ప్లాంట్స్ లోను, ఓడరేవులలోను, పవర్‌స్టేషన్‌లోను ముడిసరుకులను ఇతర సరుకులను చేరవేయ డానికి అనువుగా ఉంటుంది.

## వంట ఇంటి చిట్కాలు

### నూనె పొంగకుండా ఉండాలంటే

ఒక్కొక్కప్పుడు వేయించేటప్పుడు నూనె బాగా పొంగి బురుగులా తేలుతుంది. చిన్న అరటికాయ తొక్కగాని, కొంచెం చింతపండుగాని ముందుగావేసి వేయిస్తే నూనె పొంగదు.

### క్రొత్త బాణలి ఉపయోగించాలంటే?

క్రొత్త బాణలిగాని, దోసపెనంగాని ఉపయోగించే ముందు మొట్టమొదట కొద్దిగా నూనెవేసి కొన్ని ఉల్లిపాయ తొక్కలు వేయిస్తే బాణలికిగాని పెనానికిగాని ఏమీ అంటుకోకుండ దోశెలు చేసుకోవచ్చు.

—పద్మిని కింగ్‌స్లే

"కాలయాపన వల్ల సత్సంకల్పాలు వికల్పాలుగా మారవచ్చు."



## అధైర్యపడిపోకు



లోకులు కాకులు, ఏదైనా అంటే అధైర్య
పడిపోకు.
ఎవరో ఏదో అనుమానించారని ముఖం
చేపురించుకుని కంట తడిపెట్టకు,
జీవిత సౌందర్యానికి సంతోష పడకుండా
అటు ఇటు వ్యర్థంగా తిరగకు
చిన్నచిన్నవారు నీకంటే అధికంగా బాధ
పడతారు కాబట్టి నీపని నీవు చూసుకో
కోపం తెచ్చుకు రెచ్చిపోయి వాళ్ళని
మాటలనకు,
సద్భావంతో జీవించు. ఎంతో
సుఖపడత
...కం ఆశీపించడం న
...ర్య

### మహాత్మా గాంధి:

మహాత్మాగాంధీ దక్షిణ ఆఫ్రికాలో 22 సంవత్సరాలు గడిపాడు.

### విలియం బట్లర్ ఈట్స్:

రవీంద్రనాథ్ ఠాగూర్ గీతాంజలికి విలియం బట్లర్ ఈట్స్ ఉపోద్ఘాతం వ్రాసాడు.

* *

### మూడురోజుల యుద్ధంగా పరిణమించిన ఫుట్‌బాల్ పందెం:

1969 లో మధ్య అమెరికా ఎల్ సాల్వడార్ మరియు హోండురాస్ మధ్య జరిగిన ఫుట్‌బాల్ పందెం మూడు రోజుల యుద్ధంగా పరిణమించింది.

* * *

### డేవిస్ కప్ యునైటెడ్ స్టేట్స్ గెలుచుకుంది:

1900 లో మొట్టమొదటి డేవిస్ కప్ యునైటెడ్ స్టేట్స్ గెలుచుకుంది.

* * *

### పురుషుల సింగిల్స్‌లో గెలుపొందిన మొదటి భారతీయుడు:

వింబుల్డన్ పురుషుల సింగిల్స్ క్వార్టర్ ఫైనల్స్‌లో గెలుపొందిన మొట్టమొదటి భారతీయుడు గౌస్ మహమ్మద్.

"ఇంద్రియములకు మనస్సును, మనస్సుకు బుద్ధిని అప్పజెప్పి సరియైన నిరయాలు తీసుకోవాలి."

# ముక్కు - దాని మహాత్మ్యం

సీతా రవిచంద్రన్

ముక్కు అనడం తోటే ముక్కుతిమ్మన్న, 'తిమ్మనార్య ముద్దుపలుకు', పారిజాతాపహరణము ముందు జ్ఞాపకం వస్తాయి. పారిజాతాపహరణం రచించిన నంది తిమ్మనే ముక్కుతిమ్మన. నంది తిమ్మన ముక్కు పెద్దదిగా ఉండటంచేత ఆయన కాపేరు బహుళ వ్యాప్తిలోకి వచ్చిందని కొందరు అంటారు. ఆయన ముక్కును గురించి "నానాసూన వితాన వాసనల ...." ఒక పద్యం ప్రాసాదని వసుచరిత్రకారుడైన భట్టుమూర్తి ఆ పద్యంలో ఉండే భావసౌందర్యానికి ముగ్ధుడై కొంత డబ్బిచ్చి తిమ్మన్న దగ్గిర దానిని కొని తన గ్రంథంలో ఇరికించు కున్నాడని, అందుచేత ఆయనకి ముక్కు తిమ్మన్న అనే పేరు వచ్చిందని మరికొందరు అంటారు. రాయలవారి కొలువులో మంత్రి తిమ్మరుసు, వాకిట కావలి తిమ్మన్న, తిమ్మన్న కవి అనే ముగ్గురు తిమ్మన్నలు ఉండేవారు. వారిని సులభంగా వేరువేరుగా తెలుసుకోడానికి పెద్ద ముక్కున్న తిమ్మన్న కవిని ముక్కు తిమ్మన్న అని అంటారని మరికొందరి అభిప్రాయం. నిజమే అయి ఉండాలి.

అదిమి నొక్కేసినట్టుగా ముక్కు చైనా వారి ముక్కులా ఉంటే చప్పిడి ముక్కు అని, లావుగా పొడుగా ఉండి చివర ముందుకు సన్నగా వంగి ఉంటే చిలుక ముక్కని, లావుగా బలిష్ఠంగా ఉండి సూదిగా ఉంటే గరుడముక్కని, గుండ్రంగా మొద్దు బారి ఉంటే బొ్రముక్కని, కంట్లో మెల్లి ఉంటే మెల్లకన్నని కాళ్ళు వంకరగా ఉంటే దొడ్డికాళ్ళని లోకంలో అంటూంటారు.

వ్యక్తులకు అసలు పేర్లు ఎంత అందంగా ఉన్నా ఏదైనా ఏదో కొంచెం అంగవైకల్యం కనిపిస్తే వారిని అడ్డ పేర్లుపెట్టి పిలుచుకునే ఆచారం ఒక్క ఆంధ్రదేశంలోనే కాదు, ప్రతిచోటా ఉంది.

ముక్కునే సంస్కృతంలో నాశిక లేక ఘ్రాణేంద్రియము అంటారు. కన్నడంలో మూక్, తమిళంలో మూకు అనే పదాల నుంచి

## జేమ్స్ నెయిస్మిత్ బాస్కెట్ బాల్ క్రీడను కనిపెట్టాడు



యునైటెడ్ స్టేట్స్‌లో మెసాచుసెట్స్ స్ప్రింగ్ ఫీల్డ్‌కు చెందిన జేమ్స్ నెయిస్మిత్ 1891 లో బాస్కెట్ బాల్ క్రీడను కనిపెట్టాడు. హార్లెం గ్లోబ్ ట్రాటర్స్ అనే న్యూయార్క్ టీమ్ అమెరికాలో బాస్కెట్ బాల్ క్రీడలో ఉత్తమ టీముగా పరిగణింప బడింది.

'ప్రార్థన అంటే మాటల పరిశ్రమ కాదు. హృదయంలోని దివ్యత్వముతో మేలుకొల్పేందుకు తపన.''

వచ్చిందే తెలుగు మాట 'ముక్కు'. ముక్కులో రెండో అక్షరం ద్విత్వంలేకుండా 'ముకు' అని కూడా తెలుగులో అంటారు. సౌందర్యం దృష్ట్యా, సాహిత్యం దృష్ట్యా, సాముద్రికం దృష్ట్యా ఈ ముక్కు గొప్పదనం ఎంతో ఉన్నత స్థాయిని అందుకుంది. మాటకు మొదట కథ, భోజనానికి మొదట ఆవకాయకంటే కూడా ముఖానికి ముందు ముక్కు ఎంతో ముఖ్యం. ముఖంలో అందం అంతా ముక్కులోనే ఉంటుంది. ముఖ సౌందర్యానికి ప్రకృతిసిద్ధమైన కొలమానం ముక్కు.

ముక్కు ఆభరణ విశేషం ముక్కుపుడక, ముంగర, ముక్కర ముక్కుగమ్మి, ముక్కుపోగు, ముక్కుత్తి. ముత్తైదుకి ముగుత్తి లేక ముక్కుపుడక ముఖానికి ఎంతో శోభిస్తుంది. ముగుత్తికి ముక్కు ఆధారం. కర్ణాటక సంగీతానికి పితామహుడైన దాసవర్యుడు పురందరదాసుని ఆధ్యాత్మికోన్నతికి భార్య ముగుత్తే కారణము. ముక్కుమీద పెసరగింజంత నలుపో ఎరుపో మచ్చ ఎంతో అందగిస్తుంది. ముక్కుమీది ఆ మచ్చే ముక్కు మచ్చ.

వాసనా వైవిధ్యంలో దుర్వాసనలను, కంపులను వేరుచేసి వివిధ వస్తువుల సువాసనలను, రకరకాల పుష్పాల పరిమళాలను అంటే మల్లెపువ్వులకు మల్లెల వాసన, గులాబీ పువ్వులకు గులాబీల వాసన, సంపెంగ పువ్వులకు సంపెంగల వాసన, మొగలి పువ్వులకు మొగలి పువ్వుల వాసన ఎంతమాత్రం మిశ్రమం లేకుండా ఏ పువ్వు వాసన ఆ పువ్వుకు ఉండేటట్లు పువ్వుల పరిమళాలను తెలియజేస్తుంది ముక్కు.

కవులకు మంచి మంచి పువ్వుల వర్ణనా కౌశలం ముక్కువల్లే. పారిజాతాన్ని ఎంతగానో కవులు వర్ణించారు. ఎన్ని పువ్వులు! ఎన్ని రంగులు! మందార పువ్వు ఎంతో ఎరుపు, ఎంతో అందం, ఎంతో పెద్దది కూడా. అయినా దాని వర్ణన ఏ కవి చేయలేదు. కారణం ముక్కు సిఫారసు చేయలేదు! అందుకే మందారకు కవి వర్ణనా సౌభాగ్యం లభించలేదు. ముక్కు శోధించి తెలుసుకున్న తరువాతే కవి హృదయంలో భావ వీచికలు బయలుదేరతాయి. ముకుగ్రోలు ముక్కుగ్రోలు, నాసాపుటము. ముకుచెరవు అంటే ముక్కురంధ్రం. ముక్కులో గ్రుచ్చే త్రాడు ముక్కుకుతాడు. ముకుతాడు వేస్తే ఎంతక్రూర జంతువైనా అదుపులోకి వచ్చేస్తుంది. అది కుక్కపిల్లలా, పిల్లిపిల్లలా సాధువైపోతుంది. పొగరు అణిగిపోతుంది.

## భారతదేశంలో 200 మిలియను పట్టణ ప్రజలు

భారతదేశంలో 1981 లో ఉన్న 159.72 మిలియను పట్టణప్రజలు 1987 కి 200 మిలియను అయింది. ఇది 25.7 శాతం లేక సంవత్సరానికి 4.8 శాతం పెరుగుదలను సూచిస్తుంది. — 'యోజన' సౌజన్యంతో

''స్థిరమైన గౌరవం వ్యక్తి గుణశీలాలమీద ఆధారపడి ఉంటుంది.''

ముక్కుమీద అమరేటట్టు ఫ్రేముతో పెట్టుకున్న అద్దాలు ముక్కద్దాలు లేక ముక్కద్దము. ముక్కులేనివాడు కాని ముక్కు లేనిది కాని ముక్కిడి. 'ముక్కిడి ముత్యాలవత్తు' అన్నారు.

ఈడొచ్చిన పిల్లలకు పెళ్ళి సంబంధాలు చూచేటప్పుడు మొట్టమొదట కన్ను ముక్కు లక్షణంగా ఉన్నాయో లేదో పరిశీలిస్తారు. కన్ను ముక్కు సరిగా లేకపోతే ముక్కు ముడుచుకుంటారు. కోరినట్లు ముక్కుండి కళ్ళు తేటగా మిలమిలలాడుతూండే ముక్కు కోసుకుంటారు. విరసించేవారు, ఆక్షేపించే వారు, ఇష్టపడనివారూ అందరూ ముక్కు విరిచేవారే.

ముక్కు నడిమి ఎముక ముక్కు దూలము. ముక్కు రోగాలకు వాడే ఔషధం ముక్కు మందు. శీఘ్రంగా కోపం వచ్చే వారికి ముక్కుమీదే ఉంటుంది కోపం. అంటే చీటికి మాటికి లేనిపోని కోపంతో రెచ్చిపోతూంటారు ముక్కోపి. కోపావేశంతో నోటితో తిట్టినా చేతులతో ఎంత బాదినా ముక్కు ప్రాధాన్యం వహిస్తుంది. ముక్కోపి అంటారు. మంచి చెడ్డల విచారణ తెలియనివారు ముక్కుమొగం తెలియని వారు. ఆశ్చర్యం కలిగినా, అపచారం కలిగినా ముక్కుమీద వ్రేలుపెడతారు. స్కూలు పిల్లలు గోలచేస్తూంటే టీచర్ ముక్కుమీద వ్రేలుపెట్టి మందలిస్తుంది. అః అః తప్పు తప్పు అని చిన్నపిల్లల తప్పులను ముక్కున వ్రేలు పెట్టుకునే మందలిస్తారు పెద్దలు కూడా. బ్రతికి ఉన్నంతకాలం ముక్కులో ఊర్పు ఉంటుంది. ఏమీ మాట్లాడకుండా జపం చేసుకుంటుంటే ముక్కుపట్టుకు కూర్చున్నాడంటారు. మొగమాటం లేనివారు ముక్కుమొగం చూడరు. చేయకూడని పెద్ద పెద్ద నేరాలు చేస్తే ముక్కుకు పీరెత్తి శిక్షించే వారు. పొడవులోగానీ, ఎత్తులోగానీ ఒకరు ఇంకొకరి ముక్కువరకూ ఉంటే ముక్కు బంటి. కొంతమంది నదులలోను, చెరువుల లోను ముక్కుబంటి లోతుకు వెళ్ళి స్నానాలు చేస్తారు ముక్కులో ముల్లు గ్రుచ్చుకున్నట్లు బాధించేవాడు ముక్కు ముల్లు. నానా చిక్కులు పెట్టేవాడు ముక్కుకోతలు పెడతాడు. చిన్నవయస్సు దాటనివారు ముక్కు పచ్చలారనివారు. చిన్నవయస్సులో నవనవలాడుతూంటే వారు ముక్కుపట్టని ముత్యము. కవులు స్త్రీల అందమైన ముక్కును సంపెంగ పూవుతో పోలుస్తారు. ఇంకా అందంగా ఉంటే తిలపుష్పం అని కూడా అంటారు.

## 1841 లో టీ పెంపకం మొట్టమొదట ప్రారంభమైంది



భారతదేశంలో మొట్టమొదట ఉత్తర బెంగాల్ డార్జిలింగ్‌లో డా. కాంప్‌బెల్ తన బంగళా తోటలో 1841 లో టీ మొక్కను నాటాడు. ఆనాటి నుంచి ఇది 113 తోటలలో మొత్తం 18,888 ఎకరాలు ఆవరించుకుంది.

"ప్రలోభానికైనా ఏకాగ్రతను కోల్పోతే లక్ష్యాన్ని సాధించలేరు."

రసికులు శృంగారంలో ముక్కులు కరచుకుంటారు. కలహాలలో ముక్కులు కొరుక్కుంటే లోకులు ముక్కుమీద వేలు పెట్టుకుని 'అన్నా ఎంత పనయింది' అంటారు. మరుపు అందరికీ సామాన్యమే. ఒక్కసారి ముక్కు నలుపుకుంటే మరిచిపోయిన విషయాలు చటుక్కున జ్ఞాపకం వచ్చేస్తాయి. ఎవరైనా ఒకసారి తుమ్మితే అపశకునం. రెండుసార్లు తుమ్మితే శుభం. ఆపలింతకు అన్న ఉంటే తుమ్ముకి తమ్ముడూ ఉన్నాడు.

ముక్కుపుటాలు విస్తరించుకుంటే ఆనందం, సంతోషం, అనుభూతి తెలియజేస్తుంది. బజారులో వెడుతూంటే ఏదో మూల కొట్టులో ఎక్కడో కాఫీగింజలు వేయించి పొడిచేస్తూంటే ముక్కు ముందు పసిగట్టేస్తుంది. కొట్టుకి దారిచూపిస్తుంది. శరీరంలో ఏ రోగం ఉన్నా మొదట గుర్తించి జలుబు రూపంలో హెచ్చరించి రోగాలను బయటపెట్టేదే ముక్కు. వాతావరణంలో కాలుష్యమైన గాలిని పరిశుద్ధంచేసి మంచి గాలిని ముక్కు ఊపిరితిత్తులకు చేరుస్తుంది. సహించలేని దుర్వాసన ఏదైనా ముక్కుకు తెలిస్తే వెంటనే ప్రత్యేకమైన ప్రక్రియవల్ల ముక్కు వాసనా తృష్ణను తగ్గించి శమనం కలిగిస్తుంది. కొన్ని కొన్ని జంతువులు కంటితో జరిగే ప్రయోజనాలను ముక్కు ద్వారానే తీర్చుకుంటున్నాయి. ఎంతో దూరంగా ఉన్న ఆహారాన్ని ఇట్టే పసిగట్టడమే గాకుండా శత్రువుల నుండి ఆత్మరక్షణ కూడా చేసుకుంటున్నాయి. వైద్యశాస్త్రం ప్రకారం వివేచనచేస్తే ముక్కు ఘ్రాణశక్తి విచిత్రంగా ఉంటుంది. పరిమాణంలో చిన్నదైనా ముక్కు ఉపయోగం బ్రహ్మాండం.

అసలు మనం సాష్టాంగ నమస్కారం చేసేటప్పుడు మొదట నేలకు తగిలేది ముక్కు. కన్ను, నోరు, చెవి మొదలైన అవయవాలు లేకపోయినా కొంతకాలం జీవించవచ్చేమో గానీ ముక్కు లేకపోతే మూడునిమిషాలు బ్రతుకలేరు. ప్రాణానికి ముఖ్యద్వారమే ముక్కు. అందుకే ప్రాణులన్నిటికి స్వతః ముక్కు లేకపోయినా ముఖ్యప్రాణుడే ముఖ్యుడైనాడు. గరుడపక్షికి వచ్చిన ప్రాముఖ్యత ముక్కువల్లే.

(మిగతా 53వ పేజీలో)

## మోనాలిసా విలువ డాలర్లపైన




ఇటలీ చిత్రకారుడు లియోనార్డో డావిన్సీ చిత్రించిన చిత్రాలలో ఇప్పటికీ ఉన్న 17 చిత్రాలలో మోనాలిసా చిత్రం ప్రపంచ ప్రసిద్ధి పొందింది. దీనివిలువ 100,000,000 డాలర్లపైబడి ఉంది.

'సమయా సమయాలను గుర్తించకుండా,
ఉచితానుచితాలు పాటించకుండా ఉండటం అజాగ్రత్త.'

# కలం స్నేహాలు

[మీ పేరు, వయస్సు, చిరునామా, హాబీలు ఈ శీర్షిక క్రింద ప్రచురింపబడాలంటే తగిన వివరాలతో సహా రూ. 5/-లు మనియార్డరుద్వారా పంపండి. —సంపాదకుడు.

1. మురకొండ రాంబాబు, ఇంటర్ మొదటి సంవత్సరం, 16 సం.లు S/o ఎమ్. శివరావు. గింజుపల్లివారి పాలెం గ్రామము, ప్రత్తిపాడు మండలం, (గుంటూరు జిల్లా).

కలం స్నేహం, క్రొత్త విషయాల సేకరణ, క్రొత్త ప్రదేశాలు చూడాలన్న అభిలాష.

2. ఎస్. నవనీత, D/o బాల్‌రాజు, సూరారం గ్రామము, రామాయం పేట, చేగుంట మండలం, (మెదక్ జిల్లా) 502 255.

హాస్యం, ప్రకృతి ఆరాధన, ప్రేమను ఆరాధించడం.

3. ఎల్. వి. రహమతుల్లా, 22 సం.లు, C/O రామకృష్ణారెడ్డి, ఇం. నెం. A 11, టింబర్ డిపో కళ్యాణ్ దుర్గ్ రోడ్ దగ్గర, అనంతపురం పోస్ట్ మరియు జిల్లా.

కలం స్నేహం, ఫోటోగ్రఫీ, ప్రజాసేవ.

4. పెరుమాళ్ళ గణేశ్వరరావు, స్టెనోగ్రాఫర్, S/o సత్యనారాయణ, క్వార్టర్ నెం 12-2-17, శారదాబ్రిడ్జి వద్ద, అనకాపల్లి (విశాఖ జిల్లా) 531 001.

కథలు, కవితలు వ్రాయడం, కార్టూన్లు ప్రాక్టీస్ చేయడం, కలం స్నేహం.

5. ఎమ్ రాజన్. బి.కామ్. 19 సం.లు, C/o ఎమ్. పి రామన్ (హోటల్), శ్రీశైలం ప్రాజెక్ట్, కర్నూలు - 518 102.

కవిత్వం, సైకాలజీ తత్త్వశాస్త్రం.

## ఎందుకు?

### తేనెటీగ ఎందుకు కుడుతుంది?




తేనెటీగలలో సేవకులగుంపుకు చెందిన తేనెటీగ మాత్రమే కుడుతుంది. ఇవి సాధారణంగా తేనెపట్టును రక్షించడానికి అవలంబించే చర్యలో కుడతాయి. ఇది కుట్టినప్పుడు ముల్లు తేనెటీగ శరీరంనుంచి విడిపోయి కుట్టినచోట ఉండిపోతుంది. కుట్టిన వెంటనే ఆ తేనెటీగ చచ్చిపోతుంది. ఈ విధంగా తేనెపట్టును సంరక్షించడానికి ప్రకృతి ఒక తేనెటీగ ప్రాణాన్ని అంకితం చేయిస్తుంది.

"నేటి మానవుడు ఆడంబరాలకుపోయి అనర్థాలను కోరి తెచ్చుకుంటున్నాడు."

ఇ.కె. నర్లేశ్వర్

మిల్లీపీడ్ అంటే బహుపది. చాలాకాళ్ళుండే కీటకాలు. ఇవి ఆంత్రోపాడ్స్ అనే కీళ్ళు కలిగిన కాళ్ళతో ఉండే జంతువుల జాతికి చెందినవి. సాలెపురుగులు, జెర్రి, రోకలి బండలు వంటి కీటకాలు అన్నీ ఈ జాతిలో చేరినవే.



MILLIPEDE

ప్రపంచంలో కనిపించే సుమారు 8,000 జాతుల మిల్లీపీడ్స్ జంతువులలో భారత దేశంలో సాధారణంగా కనిపించేవి స్పైరో బోలస్ రోకలిబండ).

మిల్లీపీడ్స్ అన్నీ భూమిమీదే నివసి స్తాయి. కొన్ని రకాలు సముద్రతీరపు దేశాలలో కూడా ఉంటాయి. ఇవి సాధార ణంగా ఎండిన ఆకుల క్రింద, రాళ్ళ క్రింద, చెట్టు బెరడులమధ్య, కలపక్రింద భూము లలో నివసిస్తాయి. ఇవి సూర్యరశ్మిని భరించలేవు. కొన్ని వానపాముల బొరియ లలో నివసిస్తాయి.

మిల్లీపీడ్స్ శరీరం పై భాగం వలయా లుగా ఉంటుంది. దీని శరీరంలో వలయాలు బాల్ అండ్ సాకెట్ అమరికతో చేర్చబడి ఉంటాయి. అందువల్లే ఇవి గుండ్రంగా గట్టిగా చుట్టుకు పోగలుగుతాయి. ఈ వల యాలు రకాన్నిబట్టి మారుతూంటాయి. 8 మొదలు 240 వలయాలు దాకా ఉంటాయి.

వీటి నోటిభాగాలు స్ఫుటంగా కనిపిస్తాయి కొన్నిటికి కళ్ళు ఉంటాయి. లేకపోతే కళ్ళు బదులు చిన్న చిన్న చుక్కలు ఉంటాయి. చాలామటుకు ఈ జంతువులకు దృష్టిలేదు. ఇవి చూడలేవు.

ఒక్కొక్కప్పుడు కుళ్ళిపోయిన సేంద్రియ పదార్థాలు తిన్నా ఇవి సాధార ణంగా శాకాహారులు. కొన్ని మాంసాహారులు కూడా లేకపోలేదు.

మిల్లీపీడ్లు సాధారణంగా భూమిక్రింద చిన్న చిన్న గూళ్ళు కడతాయి. ఇక్కడ

(మిగతా43వ పేజీలో)

"లోభం వలన లాభం కలుగదు. ఇంకా అధికమైన కష్టాన్ని, దుఃఖాన్ని అనుభవించవలసి వస్తుంది."

## 75 శాతం భారతదేశపు ఎగుమతులు

భారతదేశపు 425 వాణిజ్య మరియు ఎగుమతి కేంద్రాలు ఇచ్చిన వివరాలను కంప్యూటర్ మూలంగా విశ్లేషించి వాటి ఫలితాలను అధ్యయనం చేయగా 75 శాతం ఎగుమతులు వరుసగా హాండీక్రాఫ్టులు ఉన్ని తివాసీలు, నూలుబట్టలు, విలువచేయబడిన ఆహార వస్తువులు, ఇంజినీరింగుకు సంబంధించిన వస్తూత్పత్తులు మరియు చర్మంతో తయారైన వస్తువులు అని తెలిసింది.

* * *

## ప్రపంచంలో జీడిమామిడి అధిక కొనుగోలు యుఎస్ఏది

ప్రపంచంలో జీడిమామిడి అత్యధికంగా కొన్న యుఎస్ఎ 1987 జనవరి - సెప్టెంబరు మాసాల మధ్య 12,81,877 పెట్టెలను దిగుమతి చేసుకుంది. వీటిలో భారతదేశం పంపినది 7,37,988 మరియు బ్రెజిల్ పంపినవి 3,66,173 పెట్టెలు.

* *

## జమ్ము-కాశ్మీర్‌లో అతితక్కువ రేడియో సంపర్కము

భారతదేశపు వివిధ రాష్ట్రాలలో గోవా, మణిపూర్ మరియు ప. బెంగాల్‌లో 99 శాతానికి రేడియో సౌకర్యం ఉండగా, జమ్ము కాశ్మీర్‌లో ఇది 30 శాతం మాత్రమే. సిక్కింలో 74 శాతం రేడియో సౌకర్యం ఉంది.

* * *

## భారతదేశంలో శ్రామిక ఉత్పాదన తగ్గుదల

1959-60 మరియు 1978-79 సంవత్సరాల మధ్య భారతదేశంలో శ్రామిక ఉత్పాదన సంవత్సరానికి 0.18 శాతం చొప్పున తగ్గిపోవడంవల్ల లేబర్ ఖర్చులు బాగా పెరుగుతున్నట్లు పరిశోధనలవల్ల తెలిసింది. శ్రామిక ఉత్పాదన వరుసగా 1960-70 సంవత్సర కాలంలో హాంకాంగ్‌లో 4.3 శాతం, 1960-73 లో కొరియాలో 4.1 శాతం, 1960-74 లో బ్రెజిల్‌లో 1.6 శాతం, 1963-75 లో టర్కీలో 2.2 శాతం పెరిగింది.

* * *

## భారతదేశపు ఐదుగురి పెద్ద వాణిజ్య భాగస్వామ్యం యుఎస్ఏది

భారతదేశపు ఉత్పాదనలను అత్యధికంగా కొనుగోలుచేసే దేశాలు యుఎస్ఎ, యుఎస్ఎస్ఆర్, యునైటెడ్ కింగ్‌డమ్, జపాను మరియు ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీ. భారతదేశం వీటికి 55 శాతం ఎగుమతులు చేస్తుంది. దీంట్లో యుఎస్ఎ మాత్రం 40 శాతం దిగుమతులు చేసుకుంటూంటే, యుఎస్ఎస్ఆర్ సుమారు 30 శాతం దిగుమతి చేసుకుంటుంది.

జ్ఞానం మాత్రం ఉండి ప్రేమ లేకపోతే ప్రయోజనం లేదు.

# హూపో - వడ్లపిట్ట

ఆర్. ఎల్. ఖన్నా

భారతదేశపు పక్షులన్నిటిలో 'హూపో' అనే వడ్లపిట్టను దాని రంగు రంగుల ఈకలనుబట్టి, తలమీద అందమైన పెద్ద కొండెనుబట్టి సులభంగా తెలుసుకోవచ్చు. దీనినే కూకుడు గువ్వ అని కూడా అంటారు.

లాటిన్ భాషలో హూపోని ఉపూపా (Upupa) అంటారు. కాశ్మీరు భాషలో హుద్ హుద్ లేక సటూట్, పంజాబీలో




చక్కీరహా లేక బెబేదుఖ్ అంటారు. ఈ పక్షి హూపోపో అని లేక హుద్ హుద్ అని అతి మనోహరంగా కూస్తుంది. ఈ కూతను బట్టే దానికి 'హూపో' అనే పేరు వచ్చింది.

దక్షిణ మరియు మధ్యయూరప్ నుండి, ఆఫ్రికా మరియు ఆసియా వరకు హూపో జాతికి చెందిన పక్షులు కనిపిస్తాయి. భారతదేశంలో ముఖ్యంగా మూడు జాతుల హూపో పక్షులు ఉన్నాయి. ఇవి పశ్చిమ హిమాలయ ప్రదేశాలలో పిల్లలను పెంచుతూంటాయి. పచ్చని గడ్డిమైదానాలు, తోటలు, గ్రామ సీమలలోని తోపులలో, కొండ ప్రదేశాల పంటపొలాలలోను ఇవి నివసిస్తాయి. ప్రతి తోటలోను రెండు మూడు హూపోల జతలు ఉంటాయి.

వడ్లపిట్ట సాధారణంగా మైనాపరిమాణంలో ఉంటుంది. దీని ముక్కు సన్నగా పొడవుగా వంపు తిరిగి ఉంటుంది తలమీద విసనకర్ర వంటి కొండె ఉంటుంది. తెలుపు నలుపు చారలతో రెక్కలు, పొట్టితోక ఉంటుంది. ఈ జాతిలో పెట్ట, పుంజు చూడడానికి ఒకే రకంగా ఉంటాయి. అపాయం కలుగ

(41వ పేజీ తరువాయి)

ఆడజాతి మిల్లీపీడ్స్ 40-80 దాకా గ్రుడ్లను పెడతాయి. వెలుతురు, తగినంత చెమ్మ ఉన్న వాతావరణంలో ఇవి పెరగడానికి కొన్నివారాల కాలం పడుతుంది.

చాలా రకాలకు శరీరానికి రెండు ప్రక్కలా వాసన గ్రంధులు (Odour - glands) ఉంటాయి. ఇవి ఒక విధమైన దుర్గంధంతో కూడిన ద్రవాన్ని స్రవిస్తాంటాయి. ఈ ద్రవంలో హైడ్రోసైనిక్ ఆసిడ్, అమొడిన్, క్వినోన్ వంటి రసాయనిక పదార్థాలు ఉంటాయి. అందుచేత ఇవి తినడానికి యోగ్యంగా ఉండవు. ఒక జంతు శాస్త్రజ్ఞుడు మిల్లీపిడ్స్‌తో సహా అనేక జంతువులను సేకరించి ఒక జాడీలో ఉంచాడు సైనెడ్ విషంవల్ల ఆ జంతువులన్నీ చచ్చిపోయాయి!

'సి.ఇ.ఇ.-ఎన్.ఎఫ్.ఎస్' సౌజన్యంతో

'ముందు వచ్చిన చెవులకన్నా వెనుక వచ్చిన కొమ్ములు

ఉందని తెలిసినప్పుడుగాని లేక బాగా ఉత్సా
హంగా ఉన్నప్పుడుగాని తలమీద కొండె
విసనకర్రలా వెడల్పుగా విప్పుకుంటుంది.
చిన్న చిన్న పురుగులను, కీటకాలను
తింటుంది. ముఖ్యంగా పంటలకు పట్టే చీడ
పురుగులను తింటుంది. అందువల్లనే దీనిని
'వ్యవసాయదారుని మిత్రుడు' అంటారు.

వడ్లపిట్టలు చిన్న చిన్న రంధ్రాలలో
గూళ్ళను కట్టుకుంటాయి వడ్లపిట్ట ఒకేసారి
చాలా గ్రుడ్లను పెడుతుంది. గ్రుడ్లను పెట్టిన
తరువాత రెక్కలు పెరిగి పిల్లలై గూటిని
వదిలేదాకా వాటిని ఆడపక్షి పొదుగుతుంది
ఆడపక్షి ఎన్నడూ గూటిని వదిలి వెళ్ళదు.
పిట్టపుంజు కూడా పిల్లలకు మేత పెడతాయి.
అనారోగ్య పరిసరాలలో పెరిగే ఈ పిల్లలు
చాలామటుకు చనిపోతాయి. వడ్లపక్షిని ఇన్
శానిటరీ బ్యూటీ (అనారోగ్యపుటందగత్తె)
అంటారు. రెక్కల సౌందర్యానికి తగిన
పరిశ్రుభ్రత తక్కువ. పిల్లలను అశుభ్రంగా
పెంచుతుంది.

వడ్లపిట్టలు జతలుగానో చిన్న చిన్న
గుంపులుగానో నివసిస్తాయి. మనుష్యుల
మచ్చికతో సహజంగా జీవిస్తుంది ఇది
ఆకాశంలో ఎగిరేటప్పుడు ఒక పెద్ద నలుపు
తెలుపు సీతాకోక చిలుకలాగా ఉంటుంది.

అందమైన రెక్కలతో చూడడానికి
ముచ్చటగా ఉన్నా దీనికి మధురమైన కంఠ
స్వరం లేదు. రెక్కల అందం ఎక్కువైన
కొద్దీ కంఠస్వరం మాధుర్యం తగ్గుతుంది.

వడ్లపిట్టలు ప్రాచీన ఈజిప్టు దేవాలయా
లలోను, గోరీలలోను చిత్రింపబడ్డాయి.
...దేవతగా ఆరాధింపబడే హోరస్
(Horus) దండంపైన వడ్లపిట్ట త...
చిహ్నంగా చిత్రీకరింపబడింది.

## గొల్లభామ వాద్య నైపుణ్యం




గొల్లభామ అద్భుతంగా ఫిడేలు వాయిస్తుంది. ఇది పాటతో పాడుతుందని చాలా మంది భ్రమపడతారు. ఇది నిజం కాదు. దాని రెక్కల అంచులు, రెక్కల మీది మూతలు. ఫిడేలుమీది తీగలలాగా ఉంటాయి. ఇది తన వెనుకటి కాళ్ళను కమానుగా ఉపయోగిస్తుంది. చాలాసేపు ఒకే కమానుతో వాయించదు. కొంతసేపు ఒకకాలు మరికొంతసేపు మరో కాలు ఉపయోగిస్తుంది. గొల్లభామ దగ్గరగా చేరి పరీక్షిస్తే ఇది తెలుస్తుంది. ఫిడేలు తీగమీద కమానుని పైకి క్రిందికి జరిపినట్లే ఇది వెనుకటి కాలు మడిచి రెక్కల అంచులమీద పైకి క్రిందికి జరుపుతుంది.

"పరస్పరావగాహన లేకపోతే మానవ సంబంధాలు బెడిసికొడతాయి.''

# ఉపనిషదాజ్ఞ

సాలెపురుగు ఏ ఇతర సాధనాల సహాయం లేకుండా తన శరీరంనుంచే దారాలను తయారుచేసి, వాటిని మళ్ళీ తానే మ్రింగుతున్నట్లుగా, ఈ భూమిమీద ఓషధులు పగైతా పుడుతూన్నట్టుగా, సజీవుడైన పురుషునియందు వెంట్రుకలు పుడుతూన్నట్టుగా నాశనంలేని బ్రహ్మలో జగత్తు అంతా పుడుతూంది. —ముండకోపనిషత్తు

* *

ఎవరు వివేకవంతుడైన సారథిని (బుద్ధిని) కలిగి ఉంటాడో ఎవరు కళ్ళాన్ని (మనస్సుని) తన ఆధీనంలో ఉంచుకుంటాడో అటువంటి రథికుడు (యజమాని) ఈ ప్రపంచాన్ని దాటి పరమపదరూపమైన విష్ణుపదాన్ని పొందుతాడు.

—కఠోపనిషత్తు

* * *

ఎవరు తన ఆత్మలో అన్ని ప్రాణులను చూడగలుగుతాడో, ఎవరు అన్ని ప్రాణులందు తనను చూచుకోగలుగుతాడో అట్టివాడు ఎవరిని ద్వేషింపడు. అసహ్యించుకోడు

—ఈశోపనిషత్తు

* * *

మనస్సు దానిని గ్రహించలేదు. కానీ దాని (ఆత్మ) చేతనే మనస్సు గ్రహింపబడుతూంది. మనస్సుకు అతీతమైనది తన అధీనంలో ఉంచుకోగలిగినదే ఆత్మ అని తెలుసుకో! —కేనోపనిషత్తు

* * *

సత్యవాది విజయాన్ని పొందుతాడు. అసత్యం చెప్పేవాడు విజయం పొందడు. సత్యభాషణవల్ల దేవయాన మార్గం విస్తృతమవుతుంది ఈ మార్గంలో పయనించే పూర్ణకాములైన ఋషులు సత్యం ద్వారా పొందదగిన పరమపదాన్ని పొందుతారు.

—ముండకోపనిషత్తు

## ఆసియాలో అధికంగా ప్రమాదాలు భారతదేశంలోనే



ప్రపంచంలో ఆసియాలో అధికంగా ప్రమాదాలు ఏర్పడుతున్నాయి. ఆసియాలో భారతదేశంలోనే ఇది అధికం. గత 30 సంవత్సరాలలో వరదలవల్ల భారతదేశంలో సగటున ప్రతీ సంవత్సరం సుమారు 1,400 మంది జనం మరణించారు. 1,00,000 పశువులు మరణించాయి.

— 'డిసాస్టర్ మానేజ్‌మెంట్' సౌజన్యంతో

మంచిలో చెడు, చెడులో మంచి, పవిత్రతలో అపవిత్రత,

# చదువును ఆటగా మార్చిన మహిళ

ప్రకాష్ ఖేర్

ఇటలీ దేశపు ఒక ముఖ్య జిల్లా చియారాబల్లె (Chiaraballe) లో ఆగస్టు 31, 1870న జన్మించిన మేరియా మాంటెస్సొరి తన తలిదండ్రులకు ఏకైక పుత్రిక. సౌభాగ్యవంతమైన కుటుంబం కాకపోయినా తలిదండ్రులు



MARIA MONTESSORI

ఆమెను ఉత్తమ విద్యావతిగా చేయాలనే కుతూహలంతో సకుటుంబంగా రోము నగరానికి చేరారు. ఆమెను ఒక సుప్రసిద్ధ ఉపాధ్యాయినిగా రూపొందించాలని అనుకున్నారు. కానీ మేరియా వైద్య విద్యను అభ్యసించడానికి నిశ్చయించుకుంది.

ఆడదానికి వైద్యమా! ఆనాడు ఇటలీలో ఇది ఎవరూ కనీవినీ ఎరుగని విషయం. కానీ మేరియా పట్టుపట్టింది. అంతకుముందు ఇటలీలో వైద్యవృత్తిని అవలంబించిన స్త్రీలు ఎవ్వరూలేరు. ఈమె ఇటలీదేశపు ప్రప్రథమ మహిళా డాక్టరు అయింది. నాలుగు సంవత్సరాలలో బాగా పేరుప్రతిష్ఠలు పొందింది. కానీ ఆమె నూతన విద్యావిధాన (మాంటెస్సొరి విధానం) ప్రభావంవల్ల ఆమె వైద్యకీయ ఘనత లోకవిదితం కాలేదు. రోమ్ యూనివర్శిటీ అధికారులు మొట్టమొదట సమ్మతించక పోయినా కృతనిశ్చయంతో విజయం పొంది అనేక స్కాలర్‌షిప్‌లను గ్రహించింది.

26 సంవత్సరాల వయస్సుగల మహిళ మేరియా ఉత్సాహపూరితమైన వైద్యురాలు.

## సుభాషితాలు

ఇచ్చెడి వారల సంపద
హెచ్చెడినేగాని లేమి యెట్లు కలుగురా
విచ్చెలమ నీటి జల్లిన
విచ్చలవిడి మారుచుండు వినరా వేమా!

[ ఒకరికి ఇస్తే సంపద వృద్ధి పొందుతుంది. లేకపోవడం ఉండదు. చెలమలో నీరు ఊరినట్లు ఊరుతుంది. ]

• • •

విద్యల లోపల నీతియు
వాద్యంబులలోన వీణ వరరసికులకున్
హృద్యంబై విలసిల్లును
విద్యలలో బ్రహ్మవిద్య విద్యర వేమా!

[ విద్యలన్నిటిలో నీతి విద్య, బ్రహ్మ విద్య, వాద్యంలో వీణ ముఖ్యమైనవి. ]

''ఎవరికి వారు తమ ము

తమకు తామే ప్రయత్నిం

రోమ్ యూనివర్శిటీలో సైకియాట్రిక్ క్లినిక్‌లో వైద్య వృత్తిలో నియమింపబడింది. అప్పుడు ఆమె మతిస్థిరం లేని పిచ్చివారిని గమనించుకోవలసి వచ్చింది. మానసికంగా వెనుకబడిన పిల్లలను కూడా ఈ పిచ్చి హాస్పిటల్లో పిచ్చివాళ్ళుగా నిర్ణయించి వారికి కూడా పిచ్చికి చేసే వైద్యమే చేస్తున్నట్టు కనిపెట్టింది. వారి దీనస్థితికి మిక్కిలి చింతించి మానసికంగా వెనుకబడిన పిల్లల అభివృద్ధికి ఉద్యమాలు సాగించింది.

ఈమె అదృష్టమా అన్నట్లు అప్పటికే జీన్ మేర్‌గాస్పార్డ్ ఇటార్డ్ అనే వైద్యుడు మరియు అతడి విద్యార్థి ఎడ్వార్డ్ సెక్విన్ (Edouard Sequin) ఈ విషయంలో కొంత కృషిచేసినట్టు తెలుసుకుంది. వీరు ఒక చెవిటి వానికి మాట్లాడడం, చదవడం, వ్రాయడం, తనంతట తాను తన పనులను నిర్వర్తించుకోడం మొదలైన విషయాలు బాగా నేర్పారు. 1839 లో ఇతడు మానసికంగా వెనుకబడిన పిల్లలకు ఒక ప్రత్యేకమైన పాఠశాలను ఏర్పాటుచేశాడు. అటువంటి పాఠశాలలో ఇదే మొట్టమొదటిది. పిల్లలకు చదువు నేర్పడం కాదు. విద్యార్థి తనంతట తాను విద్యాభివృద్ధికి సహకరించుకోవాలనేదే సెక్విన్ ముఖ్య అభిప్రాయం.

మేరియా ఇటలీలో మానసికంగా వెనుకబడిన మందమతుల సేవకు, వారి అభివృద్ధికి తగిన సహాయం చేయడానికి పూనుకుంది. ఈమె ఇటార్డ్ సెక్విన్‌ల ప్రాథమిక పరిశోధనను పరిశీలించి 1899 లో ట్యూరిన్‌లో ఒక ఎడ్యుకేషన్ సమావేశంలో బుద్ధిహీనులైన పిల్లలకు విద్య చెప్పించడం కష్టం కాదని చెప్పింది. అక్కడ సభ్యులు తలలు ఆడించి ప్రత్యేకంగా తమ ఎడ్యుకేషన్ సమావేశంలోకి క్రొత్తగా వచ్చిన ఈ మహిళా డాక్టరు ఎవరు అని ఆశ్చర్యం ప్రకటించారు.

మినిస్ట్రీ ఆఫ్ ఎడ్యుకేషన్ వారు ఈమె ప్రతిపాదించిన విషయాన్ని ప్రయోగాత్మకంగా ప్రారంభించడానికి అనుమతించారు. మానసికంగా వెనుకబడినవారికి ప్రత్యేకించబడిన స్టేట్ స్కూలు డైరక్టరుగా ఈమెను ఆహ్వానించారు. తన ఆశయాలను పూర్తిగా ప్రయోగించడానికి ఆమెకు తగిన అవకాశం ఏర్పడింది. ఇంతకుముందే లండన్ మరియు పారిస్ నగరాలలో ఏర్పడిన ఇటువంటి సంస్థలను ఈమె సందర్శించింది.

**శని గ్రహం భూమికంటే 90 రెట్లు పెద్దది మరియు బరువైనది**




శనిగ్రహం భూమికంటే సుమారు 90 రెట్లు అధికంగా పెద్దది మరియు బరువైనది యురేనస్ 16 రెట్లు, నెప్ట్యూన్ 17 రెట్లు

...నికి కాదు ఆచరణకే అని అందరూ గుర్తించాలి.

పగలు, రాత్రి ఆమె పట్టుదలతో, ఓర్పుతో ప్రతి బాలుని అభివృద్ధిని గమనిస్తూ తగిన మార్పులు, చేర్పులతో మందమతి పిల్లల మనస్సుకి, శరీరానికి తగిన సాధన కొరకు ఒక నూతన విధానాన్ని రూపొందించింది. ఒక పబ్లిక్ పరీక్షలో 'ఇడియట్ చిల్డ్రన్' ఇతర మామూలు పిల్లలకంటే ఎంతమాత్రం తీసిపోరని నిర్ణయించబడింది. ఇటలీలో ఈమె ఉద్యమాన్ని అందరూ శ్లాఘించారు అభినందించారు.

మేరియా ఉద్యమంలో ఒక నూతన ఘట్టం ప్రారంభమైంది. దీనివల్ల ఆమెకు అంతర్జాతీయ గౌరవప్రతిష్ఠలు ఏర్పడ్డాయి. తను సాధించిన విధానంవల్ల బుద్ధిహీనులే జ్ఞానవంతులుగా తీర్చిదిద్దబడుతూంటే, ఈ విధానంవల్ల సాధారణ బుద్ధిమంతులైన విద్యార్థులు మరింత ఎక్కువగా శోభించి ఇతోధికంగా ప్రవృద్ధిని పొందగలరని విశ్వసించింది. అప్పటికి ఆనాడు అమలులో ఉన్న విద్యాపద్ధతులు విద్యార్థులకు తగినంత ప్రోత్సాహం కలిగించడంలేదు. విద్యార్థి తనంతట తాను నేర్చుకోడానికి కుతూహలం ఉత్సాహం కలిగించే విధానంగా విద్యావిధానం మార్పుచెందాలని చెప్పింది. విసుగుతో కూడిన పాఠశాలలను విలాసవంతంగా మార్చడమే ఆమె ముఖ్య ఆశయం. ఆ ఆశయంతో ఆమె చదువును ఒక విలాసవంతమైన ఆటగా మార్చింది.

అసోసియేషన్ ఫర్ గుడ్ లివింగ్ వారు ఒక చిన్న ప్రాథమిక పాఠశాలను నిర్వహించమన్నారు. తర్ఫీదు శిక్షణ పొందిన ఉపాధ్యాయులను నియమించుటకుగానీ, బల్లలు. కుర్చీలు కొనడానికిగాని తగిన ఆర్థిక స్తోమత లేకపోయింది. మాంటిస్సోరి ఈ లోపాన్నే లాభసాటిగా గ్రహించింది. విద్యా విధానాలు తెలియని ఇద్దరు స్త్రీలను ఉపాధ్యాయులుగా నియమించింది. ఉన్న డబ్బుతో అవసరమైన తను రూపొందించిన పరికరాలను ఏర్పాటుచేసింది. ఈ విధంగా మాంటిస్సోరి విధానం ప్రారంభమైంది.

ఈ ప్రయోగంలో మాంటిస్సోరి తానే నేర్చుకోవలసినది ఎంతో ఉన్నట్టుగా గ్రహించింది. ఆరు సంవత్సరాలలోపు పిల్లలు విద్యాభ్యాసానికి చిన్నవారనే అభిప్రాయంతో ఏకీభవించింది. కానీ పిల్లలు ఆటలతో

(మిగతా 49వ పేజీలో)

## సోవియెట్ యూనియన్‌లో పురుషులకంటే స్త్రీలు అధికం



సోవియెట్ యూనియన్‌లో స్త్రీ జనాభా పురుషుల జనాభాకంటే చాలా అధికం. మొత్తం జనాభాలో స్త్రీలు 53 శాతం. యుఎస్ఎస్ఆర్ సుప్రీమ్ సోవియెట్ లెజిస్లేటివ్ బాడీలో మూడవవంతు మహిళలు.

"ఉన్నదాంతో తృప్తిపడక ఇంకా ఏదో కావాలని తాపత్రయపడుతూన్న నీవు అందరికంటే పేదవాడివి."

# జోధ్‌పూర్

ఢిల్లీకి సుమారు 618 కి.మీ. దూరంలో రాజస్థాన్‌లో ఉన్న జోధ్‌పూర్‌లో కోట అతి రమణీయంగా ఉంటుంది. 1458 లో రాజపుత్ర రాథోర్ వంశానికి చెందిన రావు జోదా జోధ్‌పూర్‌ను నిర్మించాడు.


JODHPUR CITY

నగరం చుట్టూ పెద్ద పెద్ద రాళ్ళతో 7,498 మీటర్ల పొడవైన రాతిగోడ 7 ద్వారాలతో కట్టబడింది. ద్వారాలకు బలెములవంటి ఇనుప ఊచలు అమర్చబడి ఉంటాయి. నగరంలో సుమారు 122 మీటర్ల ఎత్తుమీద కోట ఉంటుంది. కోటలో అందమైన రాజభవనాలు, శిల్పాలు చెక్కిన గోడలతో, కిటికీలతో ఎంతో అందంగా ఉంటాయి. మహారాజా సూర్‌సింగ్ నిర్మించిన మోతీ మహల్, మహారాజా అభయసింగ్ నిర్మించిన ఫూల్‌మహల్ స్తంభాలు, గోడలు, పైకప్పు అందమైన రంగు రంగుల చిత్రాలతో అలరారుతూ ఉంటాయి.

జోధ్‌పూర్‌లోని అందమైన భవనాలలో గంగాశ్యామ్ దేవాలయం మిక్కిలి శోభిస్తూ ఉంటుంది.

జోధ్‌పూర్ నగరానికి సుమారు 2 కి.మీ.ల దూరంలో మహామందిర్ అనే పట్టణంలో సుందరమైన పెద్ద దేవాలయం

(48వ పేజీ తరువాయి)

సంతృప్తిపడలేరని వారు వచ్చి నేర్చుకోడానికి కుతూహలపడతారని తెలుసుకోగలిగింది. ప్రతీ విద్యార్థిని ప్రత్యేకంగా పరిశీలించి తన విధానానికి అవసరమైన మార్పులు చేస్తూ వచ్చింది.

యూరప్, యునైటెడ్ స్టేట్స్ మరియు భారతదేశాలలో మాంటెస్సోరి విధానంలో అనేక పాఠశాలలు ఏర్పడ్డాయి. అనేక ప్రదేశాలను సందర్శించి అనుభవం తెచ్చుకుని పిల్లలకు పది సంవత్సరాల వయస్సువరకు తన విధానానికి అనుసరించ వచ్చుని నిర్ణయించింది.

పిల్లల హక్కులను ప్రతిపాదించే 'చాంపియన్ ఆఫ్ చిల్డ్రెన్స్ రైట్స్' విశ్రాంతిలేని మాంటెస్సోరి 82 వ సం.రం. వయస్సులో మే 6, 1952 లో మరణించింది. పిల్లల హక్కులను సంరక్షించడానికి నిరంతర శ్రమతో పాటుపడిన ఈమె స్మారక చిహ్నంగా వివిధ దేశాలలో వేలాది మాంటెస్సోరి పాఠశాలలు ఇప్పుడు నిర్వహింపబడుతున్నాయి.

"తగనిచోట కోపం రాకూడదు వచ్చినప్పుడు కోపం తనవశంలో ఉండాలి."

ఉంది. ఈ దేవాలయంలో 100 స్తంభాల మండపం నిర్మించబడింది. చితోర్ కొండపై ఉమెయిద్ భవన్ (రాజభవనం) మిక్కిలి అందమైనది.

జోధ్‌పూర్‌లో అందమైన సరస్సులు అనేకం ఉన్నాయి. నగరానికి 5 కి.మీ.ల దూరంలో రమణీయమైన తోట "బాల్ సమంద్".

జోధ్‌పూర్‌కి సుమారు 8 కి.మీ.ల



Jodhpur Fort

దూరంలో ఉత్తర దిక్కుగా ఉన్న మాండోర్ 1459 లో జోధ్‌పూర్ నిర్మింపక పూర్వం రాధోర్ రాజపుట్‌ల రాజధానిగా ఉండేది. ఇక్కడ విశాలమైన తోటలలో ప్రాచీన జోధ్‌పూర్ రాజుల స్మృతి చిహ్నంగా నిర్మింపబడిన కట్టడాలు (Cenotaphs) ఉన్నాయి. రంగులతో చిత్రింపబడిన 330 మిలియను దేవతల మరియు వీరుల చిత్రాలుగల పూజామందిరం ఉంది. 'హాల్ ఆఫ్ హీరోస్' (వీరుల మందిరం) లో ఒకే రీతిలో 16 గురి వీరుల చిత్రాలు ఒకే రాతిలో చెక్కబడ్డాయి.

జోధ్‌పూర్‌కి 58 కి.మీ.ల దూరంలో ఓసియా (Osia) గ్రామంలో 8వ శతాబ్దంలో నిర్మించిన అనేక దేవాలయాలు ఉన్నాయి. ఇచ్చట సూర్యభగవానుని సూర్య దేవాలయం చాలా ముఖ్యమైనది. మిక్కిలి



THE JASWANT MEMORIAL, JODHPUR

రమణీయమైనది. ఇక్కడ జైన్ తీర్థంకర మహావీర జ్ఞాపకార్థకంగా ఒక దేవాలయం నిర్మింపబడింది.

## ప్రపంచవ్యాప్తంగా 20 సం.లలో కారుల ఉత్పత్తి 38 శాతం పెరిగింది

ప్రపంచంలో ఇప్పుడు ఉన్న 37 మిలియను పాసెంజరు కార్లు వాడకం 1990 నాటికి 50 మిలియను కార్లు అవుతుంది. గత 20 సం.లలో ప్రపంచ వ్యాప్తంగా ఈ కార్ల ఉత్పత్తి 38 శాతం మరియు కార్ల అమ్మకం 35 శాతం పెరిగింది. కార్ల వినియోగంలో మొదటిది అనిపించుకున్నా కారుల తయారీలో యుఎస్ఎకి ప్రథమ స్థానం పోయింది.

'ఎకనామిక్ టైమ్స్' సౌజన్యంతో

"ధర్మాన్ని ఆచరించనిదే మనస్సును అంటి ఉన్న మాలిన్యాలు వదలవు."

సముద్రంలో అపారమైన సంపద ఉంది. యుఎస్ఎలో డౌ కెమికల్ కంపెనీ వారు నేరుగా సముద్రపు నీటినుంచి సుమారు 500 పదార్థాలను తయారుచేస్తున్నారు.



ఒక ఘనమైలు పరిమాణంగల సముద్రపు నీటిలో 5 బిలియన్ డాలర్ల విలువగల 175 మిలియను టన్నుల రసాయనిక పదార్థాలు నిల్వచేయబడి ఉంటాయి.

ప్రతి ఘనమైలు పరిమాణంగల సముద్రపు నీటిలో 93 మిలియను డాలర్ల విలువగల బంగారం, ఎనిమిదిన్నర మిలియను డాలర్ల విలువగల వెండి ఉంటుంది.

ప్రతీ ఘనమైలు నీటిలోను 7 టన్నులు యురేనియం, ఇతర అవసరమైన ఖనిజాలు మూలపదార్థాలు, రసాయనిక పదార్థాలు కరిగి ఉంటాయి. ప్రతి ఘనమైలు సముద్రపు నీరు 5 బిలియన్ డాలర్ల విలువ చేస్తుంది. ఈ లెక్కన మొత్తం మహాసముద్రాల విలువ ఒక క్వింటిలియన్ - అయిదువందల క్వాడ్రిలియన్ డాలర్లు అవుతుంది.

ఒక క్వాడ్రిలియన్ డాలర్లు అంటే వెయ్యి ట్రిలియను. ట్రిలియను అంటే ఒక వెయ్యి బిలియను. బిలియను అంటే వెయ్యి మిలియను. మిలియను అంటే వెయ్యివేలు, కాబట్టి ఒక క్వింటిలియన్ అంటే వెయ్యి క్వాడ్రిలియన్ డాలర్లు.

## అనుమానం - పెనుభూతం

ప్రపంచంలో మానవులంతా సోదరులని అన్ని మతాలు చెబుతాయి. ప్రజలలో పరస్పర ప్రేమ, సానుభూతి పెంపొందించేందుకు కృషి చేయడం మతకర్తల విధి. ప్రజలు కోరేది ఇంగితజ్ఞానం పెంపొందించుకునే రహస్యం. అనుమానం, అపనమ్మకం ప్రజలలో తలఎత్తితే ఎవరికి వారు వేరు పడిపోయి ఒకరినొకరు సులభంగా చంపుకోడానికి ప్రయత్నిస్తారు.

ఒకసారి ఎడారిలో ప్రయాణం చేస్తున్న ఒక వ్యక్తికి చాలా దూరంలో ఏదో కదులుతున్నట్టు కనిపించింది. అది క్రూర రాక్షసుడనో, నరభక్షకుడనో భావించి ప్రయాణీకుడు తన దగ్గర ఉన్న తుపాకీ తీసి గురిపెట్టాడు. అతడి ప్రయాణం ముందుకు సాగుతూంది. ఎదురుగా కనిపించే రూపం ముందుకు దగ్గర దగ్గరగా వస్తూంది. ఒకరినొకరు సమీపించారు. ప్రయాణీకుడు భావించినట్టుగా ఆ ఎదుటి రూపం క్రూర రాక్షసుడు కాదు. నరభక్షకుడుకాదు. విశ్వైక శాంతిని కోరుతూ అభినందించడానికి చేతులు సాచిన ఒక మనిషి. చాలా కాలం జాడ తెలియకుండా పోయిన సోదరుడు. ఇద్దరు అమాంతం ఆనందభాష్పాలు రాల్చారు.

"జ్ఞానుల జన్మ, కర్మ భోగానికి కాదు భగవత్ జ్ఞాన నిర్వాహణకే."

# విజ్ఞాన సహాపిక

## కథాకళి నృత్యము

భారతదేశపు నాట్యకళలో ప్రసిద్ధి పొందిన కథాకళి నృత్యానికి కేరళ దేశం పుట్టినిల్లు. రామాయణం, మహాభారతం వంటి సుప్రసిద్ధ కావ్యాలలో కథలను ఇతివృత్తముగా తీసుకుని రచింపబడిన నృత్య నాటికలే కథాకళి.



KATHAKALI

కథాకళిలో ముఖ్యంగా భావాలను తెలియజేయడానికి అభినయం చేస్తారు. దీనినే ముద్రలు అంటారు. నోటితో పలుకు మాటలకు బదులుగా ముద్రలు ప్రదర్శింపబడతాయి. ఈ నృత్యం చేసేవారు వేసుకునే మకుటాలు, కట్టే బట్టలు చాలా అద్భుతంగా కనిపిస్తాయి. వీరు వేసుకునే రంగు పాత్రను తెలియజేస్తుంది: కళ్ళు, కనుబొమ్మలు త్రిప్పుటవల్ల భావప్రకటన మరింత విశదం అవుతుంది. భావానుగుణ్యంగా ప్రదర్శించే అంగవిన్యాసం సామరస్యాన్ని ప్రతిబింబింప చేస్తుంది.

రంగస్థలం మీద, చిమ్మచీకటిలో ఒక చిన్న నూనె దీపం సన్నని కాంతిని ప్రసరిస్తూంటుంది. దేదీప్యమానమైన రంగుల తెరలు, ఆశ్చర్యకరమైన చిత్రాలు, దీర్ఘాలాపనతో సంగీతం ప్రేక్షకులను మోహింపజేస్తాయి.

కేరళ కవిగా ప్రసిద్ధి పొందిన వల్లతోల్ నారాయణమీనన్ ఉద్యమ ఫలితంగా నేడు కథాకళికి చెప్పుకోదగిన ప్రాముఖ్యత ఏర్పడింది.

## బ్రహ్మాండమైన సైకిల్ ప్రయాణం

40 సంవత్సరాల భారత స్వాతంత్ర్యం జ్ఞాపకార్థంగా 12 మంది యువకులు న్యూఢిల్లీ నుంచి బయలుదేరి 2,800 కి.మీ.ల నేషనల్ హిమాలయన్ యాత్రను 42 రోజులలో నిర్ణయించుకున్న చోటుకి తిరిగి వచ్చారు. వివిధ రాష్ట్రాల నుంచి బయలుదేరిన యువకులు మనాలి-కెలాంగ్-లె-లడక్ ప్రదేశాల మీదుగా హిమాలయ పర్వత ప్రదేశంలో ప్రపంచంలో మిక్కిలి ఎత్తైన ఖార్దాంగ్‌లా (18,980 అ.) మరియు టాంగ్‌లాంగ్‌లా (17,660 అ.) కనుమల ద్వారా ఢిల్లీ చేరుకున్నారు.

ఎదుటివారి భావాలను, అభిప్రాయాలను సరిగా అవగాహన చేసుకోడంపైనే మన విజయం ఆధారపడి ఉంటుంది.''

# తుని ప్రేమించడం అంటే?

తోటి మానవులను ప్రేమించుటయే భగవంతుని ప్రేమించుట. ఆప్తులైన భార్యాబిడ్డలపట్ల, బంధువులపట్ల మన కెటువంటి సద్భావం ఉంటుందో అలాగే ఇతరులపట్ల, పేదలపట్ల సహనం, ప్రేమ ఉంటే.... మనం భగవంతుని ప్రేమిస్తున్నాం అన్నమాటే.



ఇతరులలో ఉండే గుణదోషాలను కనిపెట్టడానికి బదులు మన హృదయంలో కరుడుగట్టుకుపోయిన మన దోషాలను చూచుకున్నట్లైతే.... మనం భగవంతుని ప్రేమిస్తున్నాం అన్నమాటే.

స్వార్థపరాయణతతో స్వలాభం కోసం ఇతరులను హింసించడానికి బదులు పరుల లాభంకోసం మనం కష్టపడగలిగితే... మనం భగవంతుని ప్రేమిస్తున్నాం అన్నమాటే.

ఇతరుల కష్టాలకు అనుతాపంతో మనం కష్టాన్ని అనుభవిస్తూ వారి సుఖసంతోషాలకు మనం ఆనందించగలిగితే.... మనం భగవంతుని ప్రేమిస్తున్నా మన్నమాటే.

మన దురదృష్టానికి విచారించకుండా ఎంతోమంది అదృష్టహీనుల కంటే ఎంతో అదృష్టవంతులం అని అనుకుంటే.... మనం భగవంతుని ప్రేమిస్తున్నాం అన్నమాటే.

భగవంతుని సృష్టిలో ఏ జీవికైనా ఎటువంటి హాని చేయకుండా ఉంటూ భగవద్భక్తి, భగవదారాధన మాత్రమే మహత్తర కార్యమని గ్రహించి దివ్యమైన అనుభూతి పొందగలిగితే.... మనం భగవంతుని ప్రేమిస్తున్నాం అన్నమాటే.

భగవంతుని దివ్యప్రేమతో ప్రేమించాలంటే భగవంతుని ఎక్కడో వెతకనక్కరలేదు. మన హృదయంలో మన ఆత్మే పరమాత్మ.

—మెహర్ బాబా

---

(39 వ పేజీ తరువాయి)

శ్రీరాములవారి ఆజ్ఞను అనుసరించి లక్ష్మణుడు శూర్పణఖ ముక్కు తెగకోస్తాడు. పరిత్యాగంతో ప్రారంభించి పరిత్యాగంతో అంతమయ్యే రామాయణ కథ అంత పెద్దగా పెరగడానికి ఇదే కారణం. ముక్కు కోయబడ్డ శూర్పణఖ రావణునికి ఉపదేశిస్తుంది. రావణుడు కోపంతో సీతాపహరణానికి పూనుకున్నాడు. శూర్పణఖ ముక్కు నాశనమే లంక నాశనానికి కారణమైంది.

ముక్తికి మూలాధారమైన ముక్కు పట్టుకునే ప్రాణాయామం చేస్తారు, ముక్తికి మార్గాన్ని శోధించడానికి ప్రయత్నిస్తారు.

ముక్కుమూస్తే నోరు తెరుచుకుంటుంది ఏదైనా ముక్కు ముపై ఏళ్ళు పెరుగుతుంది జాగ్రత్తగా గమనించుకోండి!

'అనుభూతి, అనుభవం ప్రమాణంగాని




**అమెరికాలో సగటు ఉద్యోగస్థుడు మాటి మాటికి ఉద్యోగాలు మారుతూంటాడు**

అమెరికాలో సగటు ఉద్యోగస్థుడు సాంకేతిక విజ్ఞానం మార్పుచెందుతూండడంవల్ల, ప్రపంచంలో పోటీవల్ల రిటైరు కావడానికి ముందు ఆరుసార్లు ఉద్యోగం మూడుసార్లు వృత్తిని మారుస్తాడు.

* * *

**ఆస్ట్రేలియాలో బంగారు ఖనిజ వ్యాపార కేంద్రం:**

ఆస్ట్రేలియాలో పశ్చిమ ఆస్ట్రేలియా బంగారు ఖనిజ వ్యాపార కేంద్రం. కమ్యూనిస్టు నేషన్స్ చేరకుండా ప్రపంచంలో 3 శాతం బంగారం ఇక్కడ ఉత్పత్తి కాబడుతూంది. దేశంలో 80 శాతం (ఒక మిలియన్ ఔన్సుల కంటే అధికం) బంగారం పశ్చిమ ఆస్ట్రేలియాలో ఉత్పత్తి అవుతూంది.

—'లాంప్' సౌజన్యంతో

* * *

**24 గంటల బాంకింగ్ సర్వీసు**

న్యూఢిల్లీలోని కన్నాట్ ప్లేస్ హాంగ్ కాంగ్ బాంక్ బ్రాంచిలో ఆటోమాటిక్ టెల్లర్ మెషీన్ ఏర్పాటైన దగ్గర నుంచీ 24 గంటల బాంకింగ్ సర్వీస్ సౌకర్యం అమలులోకి వచ్చింది. ఖాతాదారులకు ఎలక్ట్రానిక్ టెల్లర్ కార్డులు ఇస్తారు. దీంతోపాటే రహస్యమైన కోడ్ నెంబరు కూడా ఒకటి ఇస్తారు. ఇదే వారికి పర్సనల్ ఐడెంటిఫికేషన్ నంబరుగా ఉపయోగపడుతుంది. బాంకులో పనిచేసే ఉద్యోగస్థులకుకూడా ఖాతాదారుని నెంబరు తెలియదు.

* * *

**ఇన్‌స్టంట్ 'టీ'**

నేషనల్ డైరీ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ వారు అమ్మకానికి పెట్టిన ఇన్‌స్టంట్ 'టీ' డబ్బా తెరిచిన తరువాత నెలరోజులు దాకా చెడిపోకుండా తాజాగా ఉంటుంది. డబ్బా తెరవకుండా ఉంటే ఆరునెల్ల పాటు చెడిపోకుండా ఉంటుంది. 100 గ్రాముల డబ్బాలో 13 గ్రా.ల పాలక్రొవ్వు, 31.95 గ్రాముల పాల పదార్థాలు, 39.5 గ్రాముల పంచదార, 14 గ్రా.ల టీ సాలిడులు, 2 గ్రాములు తేమ ఉంటాయి.

* * *

**భారతదేశపు ప్రప్రథమ నావల్ వార్‌ఫేర్ కాలేజి**

బొంబాయి కరంజా దగ్గర భారతదేశపు ప్రప్రథమ నావల్ వార్‌ఫేర్ కాలేజి ఏర్పాటు చేయబడింది. ఇది మధ్య ప్రదేశ్ మౌ (Mhow) వార్‌ఫేర్ కాలేజీకి, సికింద్రాబాద్‌లో ఎయిర్‌ఫోర్స్ కాలేజీ ఆఫ్ ఎయిర్ వార్‌ఫేర్‌కి సమానంగా ఉంటుంది. భారతీయ నౌకా దళంలో సీనియర్ ఆఫీసర్ల పనికి అనుభవానికి సహాయకారిగా ఉంటుంది.

''గతించిన కాలం మనది కాదు. రేపు అనేది

"ఆకాష్" మూడవతరం మిస్సైల్స్:

భారతదేశం అభివృద్ధి చేసిన మూడవ తరం మిస్సైల్స్ నాలుగింటిలో ఒకటైన "ఆకాష్" - వివిధ లక్ష్యాలలో తన గురిని తెలుసుకుంటుంది. దీనిని ప్రేల్చినప్పుడు ఆకాష్‌లోని కంప్యూటర్ దీనిని నడిపిస్తుంది. లక్ష్యప్రదేశానికి చేరే సమయంలో దాని రాడార్ స్విచ్ అదే వేసుకుని ప్రత్యేక క్ష్యాన్ని తాకుతుంది.

* * *

## అస్సాంలో 'టీ' 1923 లో కనుగొనబడింది

అస్సాంలో మొట్ట మొదట టీ 1923 లో అప్రయత్నంగా కనిపించింది. ఈస్టిండియా కంపెనీకి చెందిన మేజర్ రాబర్ట్ బ్రూస్, గవర్నర్ జనరల్ లార్డ్ విలియం బెంటింక్ ప్రభువుకు 'టీ'ని కనుగొన్నట్టు చెప్పారు. ఈనాడు ప్రపంచంలో మొత్తం టీలో 30 శాతం భారతదేశం ఉత్పాదిస్తోంది.

* * *

## బిసి 7వ శతాబ్దపు వస్తువులు

మధ్య ఆసియా సోవియెట్ కజఖస్థాన్ జహలావ్రులీగ్రామం దగ్గర వరదగా ప్రవహిస్తున్న ప్రవాహం దగ్గర పిల్లలకు 25 వస్తువులు దొరికాయి. వాటిలో రెండే రెండు తప్ప మిగిలినవన్నీ బంగారపు వస్తువులు. ఈ వస్తువులు అన్నీ బిసి 7 వ శతాబ్దానికి చెందినవి.

## మానసికంగా ఆరోగ్యవంతులైన వారి గుణగణాలు



సమస్యలు తలెత్తినప్పుడు వాటిని గురించి వివేచనతో వెంటనే ఆలోచిస్తారు.

బాధ్యతలను వహిస్తారు.

ఎక్కడ వీరైతే అక్కడ అనుకూల వాతావరణాన్ని సృష్టించుకుంటారు. అవసరమైనప్పుడు పరిష్కరించుకుంటూ సరిపెట్టుకుంటారు.

ముందుగానే ప్లాను తయారుచేసుకుంటారు. భవిష్యత్తుని గురించి భయపడరు

క్రొత్త క్రొత్త అనుభవాలను, ఆదర్శాలను ఆదరిస్తారు.

సహజ శక్తులను వినియోగించుకుంటారు.

వాస్తవమైన లక్ష్యాలను ఏర్పరచుకుంటారు.

ఇతరులపై ఆధారపడకుండా వారంతట వారు ఆలోచించుకుని నిర్ణయాలు తీసుకుంటారు.

తమశక్తి సామర్థ్యాలను వినియోగించి సాధనకు పూనుకుంటారు. ఆ విధంగా ఆచరించినదానికి సంతృప్తి పడతారు.

— హెల్త్ సౌజన్యంతో

"మాట్లాడేటప్పుడు హావభావాలు, ఆంగికమైన అభినయం ... నాయి."

అమిత్ గులాతీ

బ్యాంక్ మైనా సాధారణ మైనా జాతికి చెందిన పక్షి. భారతదేశపు మైదాన ప్రదేశాలలో అన్నిచోట్ల కనిపిస్తుంది.

దీని శరీరం మీద ఈకలు సిమెంటు పలక రంగులో ఉంటాయి. తలపైన మరియు తలకు రెండుప్రక్కల నల్లరంగు ఉంటుంది. కళ్ళచుట్టూ ఇటుకరంగు చర్మం వ్రేలాడుతూ ఉంటుంది. ముక్కు పసుపుపచ్చని నారింజ వర్ణంలోను, కళ్ళు ఎర్రటి ఎరుపు రంగుతోను ఉంటాయి. రెక్కలు, తోక కూడా నలుపు వర్ణంలో ఉండి తోక చివర లేత పసుపురంగుగా ఉంటుంది.


Myna

సాధారణంగా బాంక్ మైనాలు మార్కెట్ ప్రదేశాలలో కాకులతోపాటు కనిపిస్తూ నానా పదార్థాలనూ తింటూంటాయి. ముఖ్యంగా ప్రోగుచేసిన పెంటకుప్పల దగ్గర కూడా తిరుగుతూంటాయి. బాగా పెరిగిన తోటలలో నివసిస్తూన్నా సాధారణంగా నదుల గట్లమీద, కాలువ గట్లమీద ఎగురుతూంటాయి. బాంక్ మైనా పక్షులు సంఘీభావంగా కలిసి మెలిసి గుంపులు గుంపులుగా నివసిస్తాయి. నదుల కాలువల గట్లమీద రంధ్రాలు చేసి వాటిలో గ్రుడ్లను పెడతాయి. పట్టణాలలో, ఊళ్ళలోను బ్రిడ్జిల క్రింద గోడలలో రంధ్రాలలో ఉంటాయి. లోపలికి తొలిచిన రంధ్రం చివరదాకా ఉంటుంది. ఏప్రిల్ నుండి జూలై వరకు గూళ్ళు కట్టుకుని గ్రుడ్లు పెడతాయి. గ్రుడ్లు నున్నగా లేత నీలిరంగులో చిన్న చిన్న కోడిగ్రుడ్లలా ఉంటాయి. గ్రుడ్లకు గుర్తులేవీ ఉండవు. సాధారణంగా ఆడపక్షి నాలుగు అయిదు గ్రుడ్లను పెడుతుంది.

—'అనిమల్ సిటిజన్' సౌజన్యంతో

## సెకండుకి 320 మిలియను కంప్యూటర్ ఆపరేషన్లు

ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ జర్మనీలో ఇటీవల సెకండుకి 320 మిలియను కంప్యూటర్ ఆపరేషన్లు చేయగల సు (Suprenum) అనే ఎలక్ట్రానిక్ డాటా ప్రోసెసింగ్ విధానాన్ని ప్రవేశ ట్రిక్-సిక్స్టీన్ ఇండివిడ్యువల్ ఒకదానికి ఒకటి చేర్చటంవల్ల ఇది ఏర్పడి దేనికది సమస్యను విడివిడిగా సాధిస్తాయి. సాంప్రదాయకంగా ఉన్న కంప్యూటర్లు ఒకదాని తరువాత ఒకటి సమస్యను సాధిస్తాయి, కాబట్టి కాలం చాలా వ్యర్థం అవుతుంది.

—'జర్మన్ ఫీచర్స్' సౌజన్యంతో

కదిలే చెయ్యి వ్రాస్తూనే ఉంటుంది. ఒకసారి వ్రాశాక వ్రాసినదాంట్లో ఏ కొంచెం కూడా వెనక్కి తీయలేరు."

## నయాగరా జలపాతం

సుప్రసిద్ధ నయాగరా జలపాతం కెనడా - యునైటెడ్ స్టేట్స్ సరిహద్దులలో నయాగరా నదిమీద ఉంది. నయాగరా నది ఒక మట్టం నుంచి ఇంకో మట్టానికి నిమిషానికోసారి



5,00,000 టన్నుల నీటిని ప్రవహింప జేస్తుంది. 10,000 మరియు 20,000 సంవత్సరాల ఈ ప్రాచీన జలపాతం మంచు యుగం అంతం అయేటప్పుడు పెద్ద పెద్ద భూభాగాలు మంచుతో పూర్తిగా కప్పబడి పోయినప్పుడు ఏర్పడింది.

## గెయిసెర్ అంటే ఏమిటి?

ఇటీవల కొన్నేళ్ళక్రిందట అగ్ని పర్వతాలు ఉధృతంగా విజృంభించిన ప్రదేశాలలో గెయ్‌సెర్లు కనిపిస్తాయి. ప్రత్యేక కాలావధులలో వేడినీటిని ఆవిరిని వాతావరణంలోకి పంపే వేడినీటి బుగ్గే గెయ్‌సెర్. యుఎస్ఏ వ్యోమింగ్‌లో ఎల్లోస్టోన్ నేషనల్ పార్క్‌లోను, ఐస్‌లాండ్‌లోను, న్యూజిలాండ్‌లోను వేడినీటి బుగ్గలు విస్తారంగా ఉన్నాయి.

ఐస్‌లాండ్‌లో 26 చ.కి.మీ.ల వైశాల్య ప్రదేశంలో 30 గెయ్‌సెర్లు ఉంటాయి. న్యూజిలాండు వాయ్‌మంగులో ఒక వేడినీటి బుగ్గ (గెయ్‌సెర్) 1900 నుంచి 1904 వరకు చాలా చురుకుగా కనిపించింది. దీని నుంచి వచ్చేనీరు 460 మీటర్ల ఎత్తువరకూ వచ్చింది. యుఎస్ఏ ఎల్లోస్టోన్ నేషనల్ పార్కులో ఉన్న 200 గెయ్‌సెర్లలోను ఓల్డ్ ఫెయిత్‌ఫుల్ గెయ్‌సెర్ చాలా ప్రసిద్ధి పొందింది. ఇందులోనుంచి ఆవిరి, వేడినీరు సరిగ్గా గంటకొకసారి అయిదేసి నిమిషాల పాటు 45 మీటర్ల ఎత్తుగా లేస్తూంటాయి.

## 'భూఖండ సంపాత' సిద్ధాంతం

భూఖండ సంపాత సిద్ధాంతాన్ని (Continental Drift Theory) అనుసరించి భూఖండాలు ఒక స్థానం నుంచి మరో స్థానానికి జరిగిపోతాయి. 50 మిలియను సంవత్సరాలలో ఉత్తరప్రదేశ్ మరియు బీహార్ కలిసి ఉన్న ఉత్తర భారతదేశం అంతా హిమాలయ ప్రదేశానికి జరిగిపోతుంది. భారతదేశం సంవత్సరానికి 5 సెం.మీ చొప్పున ఉత్తర దిక్కుగా జరిగిపోతూంది. ఇదే సమయంలో ఆస్ట్రేలియా భూమధ్య రేఖమీద ఎక్కడో ఇరుక్కుంటుంది అంటే ఆశ్చర్యంలేదు.

## అయొడీన్ మొదట 1811 లో వేరుచేయబడింది

అయొడీన్ సముద్రంలోను, భూమిలోనూ కూడా లభించే రసాయనిక మూల పదార్థం. దీనిని మొట్టమొదట 1811 లో బెర్నార్డ్ కోర్టాయిస్ అనే శాస్త్రజ్ఞుడు సముద్రపు కలుపునుండి వేరుచేసాడు. కొంతకాలం వరకు సముద్రాలలో లభించే 'కెల్ప్' అనే సముద్రపు కలుపు దీనికి ఆధారంగా ఉండేది. ఇటీవల చాలామటుకు అయొడిన్ నైట్రేటు డిపాజిట్లనుంచి తీస్తున్నారు. ప్రపంచంలో చైలీ మరియు బొలీవియా నైట్రేటును విస్తారంగా సరఫరా చేస్తాయి.

## నికోలాస్ అపెర్ట్ 'ఫుడ్ కేనింగ్' మొట్టమొదట ప్రారంభించాడు

18 వ శతాబ్ది చివరిభాగంలో సీలు చేసిన గాజు బుడ్డీలలో ఆహారాన్ని నిల్వచేయడానికి నికోలాస్ అపెర్ట్ అనే ఫ్రెంచి పౌరుడు ప్రయోగాలు చేశాడు. నెపోలియన్ నౌకా సైన్యం కోసం మాంసం, పండ్లు, కూరగాయలు మొదలైనవాటిని నిల్వచేయడంలో పొందిన విజయానికి 1806 లో ఇతనికి 12,000 ఫ్రాంక్‌లు బహుమానం లభించింది. 1810 లో లండన్‌కి చెందిన జాన్‌హాల్, బ్రెయన్ డాంకిన్ గాజుబుడ్డీలకు బదులు రేకు డబ్బాలను ఉపయోగించడం ప్రారంభించారు.

## ప్రపంచంలో మిక్కిలి పెద్ద డెల్టా

ఒక నది సముద్రంలో కలిసే ప్రదేశంలో సమమట్టమైన త్రిభుజాకారపు భూభాగమే డెల్టా. ఇది త్రిభుజాకారంలో ఉండే గ్రీక్ అక్షరం 'D' నుండి ఏర్పడింది. ప్రపంచంలో మిసిసిపీ నదీ డెల్టా (యుఎస్ఎ) మిక్కిలి పెద్దది. అతిసారవంతమైన 90,000 చ.కి.మీ. ఈ డెల్టా ప్రదేశంలో ప్రత్తి పుష్కలంగా పండుతుంది.

ఉత్తర ఆఫ్రికా ఈజిప్టులో నైలునదీ డెల్టా కూడా చాలా పెద్దది. ఇక్కడ భూమి కూడా మిక్కిలి సారవంతమైనది.

## జిరాఫీకి కంఠస్వరం ఉండదు




జంతువు లన్నిటిలోను జిరాఫీకి కంఠస్వరం ఉండదు. సన్నగా ఈలవేస్తుంది. ఇది దీని శరీరబలంవల్ల, కాళ్ళ బలంవల్ల జీవిస్తుంది. జిరాఫీ తన్నుకి సింహం కూడా పారిపోతుంది. బాగా పెరిగిన జిరాఫీ 18 అడుగుల ఎత్తుగా ఉంటుంది. దాని మెడ 7 అడుగుల పొడవు ఉంటుంది.

'స్త్రీలకు నగలన్నిటికంటె నగైనవాడు భర్త.'

# అందమైన చీటాల్

ఎల్. బాలసుబ్రమణియమ్

భారతదేశపు దుప్పి జాతికి చెందిన జంతువులన్నిటిలో చీటాల్ (Chital) మిక్కిలి అందమైనది. ఆకురాల్చు చెట్లు విస్తారంగా పెరిగే డెసిడ్యువస్ అరణ్యాలలో, పొడిగానూ, తేమగానూ ఉండే ప్రదేశంలో నివసిస్తుంది. విస్తారంగా నీరు లభించే విశాలమైన



CHITAL

అడవులు దీనికి అనువుగా ఉంటాయి. ఎగుడు దిగుడుగా ఉండే రాతి మైదాన ప్రదేశాలలో తిరగదు. భారతదేశపు ఇతర దుప్పులు లేళ్ళ వలె గాక ఇది రాత్రిపూట అంతగా సంచరించదు. పగలు చాలా పొద్దు పోయిన తరువాత మధ్యాహ్నానికి ముందు మేత మేస్తుంది.

చీటాల్‌కి కొమ్ములే అందం, తీవి కలిగిస్తాయి. కొమ్ములు కొంచెం ఎరుపు ఇటుక వర్ణంలో ఉంటాయి. 12 సెం.మీ.ల లావుగా, 95 సెం.మీ.ల పొడవువరకు కొమ్ములు ఎదుగుతాయి. మగజాతికే కొమ్ములు ఉంటాయి. పశువుల, గొర్రెల కొమ్ముల కంటే వేరుగా ఉంటాయి. చీటాల్‌కి ఆగస్టు మాసంలో కొమ్ములు పడిపోతాయి. తిరిగి వర్షాలు అంతమయ్యేటప్పటికి కొమ్ములు పెరుగుతాయి.

అడవులలో నివసించే జంతువులన్నిటిలో చీటాల్ ఎక్కువగా కలుపుగోలుతనంగా సాధువుగా ఉంటుంది. చీటాల్ వీపుమీద చిన్న చిన్న పురుగులుంటాయి. వీటిని తిన

## ముసలితనాన్ని ముందుకు నెట్టే కొత్త కాంపౌండు

మానవుని మెదడులో శంకువు వంటి సూచీ ఆకారపు ఎపిఫైసిస్ (epiphysis) గ్రంథి స్రవించే ఒక కాంపౌండు (యౌగిక ద్రవ్యం) వల్ల జంతువుల యొక్క మరియు మానవుల యొక్క వృద్ధాప్యం సమీపించే కాలవేగం తగ్గుతుందని సోవియట్ శాస్త్రజ్ఞులు అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. పరిశోధకులు లెనిన్ గ్రాడ్ ఆన్కొలాజికల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్‌లో ఎలుకల మీద ప్రయోగాలు సల్పుతూ వాటికి చిన్న జంతువుల ఎపిఫైసిస్ నుంచి పాలిపెప్టైడ్ కాంపౌండులను గ్రహించి ఇంజెక్టు చేసారు. ఇది సత్ఫలితాలను చూపి వాటి జీవిత ప్రమాణాన్ని వృద్ధి పరచింది. మానవుని జీవిత ప్రమాణం సుమారు 150 సంవత్సరాలు కాబట్టి ఇటువంటి ఆయుర్వర్ధక ఔషధాలు [illegible] ఆశాభావాన్ని సూచిస్తున్నాయి.

'తుమ్మెద పూవుపై వ్రాలి మకరందాన్ని ఆస్వాదించేటప్పుడు మౌనమే తప్ప ధ్వని చేయదు.''

దానికి పైనాపళ్లు పీటిమీద వాలు తూంటాయి. నల్లటి డ్రోంగోలు కొమ్మల మీద ఉండే పురుగులను తింటాయి.

లాంగూర్ కోతులు మరియు చీటాల్ స్నేహం చాలా వింతగా కనిపిస్తుంది. లాంగూర్‌లు సాధారణంగా చెట్లమీద చేరి ఆకులు, కాయలు తింటూంటాయి. చీటాల్‌లు ఆ చెట్లక్రింద చేరి కోతులు వదేసిన ఆకులు, పండ్లు తింటాయి. లాంగూర్ కోతులు అతి నైపుణ్యంగా రాబోయే అపాయాలను పసిగడతాయి. వాటి హెచ్చరికతో చీటాల్ పరుగెత్తిపోతుంది.

అపాయం సంభవిస్తుందనే హెచ్చరికకు చీటాల్‌లో భయం అనేక విధాలుగా ప్రదర్శింపబడుతుంది. భయపడిన చీటాల్ బాగా నిలువుగా. నిటారుగా నుంచుని నడుస్తుంది. మెడను పొడవుగా చేస్తుంది. చెవులు నిక్కపొడుచుకొని శబ్దం విని అపాయం ఏ దిక్కునుంచి వస్తుందో తెలుసుకుంటుంది. అపాయం ఇంకా అధికమవుతుందని తెలిసినప్పుడు తోక ఎత్తుతుంది. ముందుకాలితో నేలను కొడుతూ కాలు దువ్వుతుంది. బాగా గట్టిగా అరవడం ప్రారంభిస్తుంది.

చీటాల్‌లకు సాధారణంగా చెలగాటం చాలా ఇష్టం. ముందుకు పరుగెత్తుతూంటాయి. వెనుక కాళ్ళతో నేలను దువ్వుతాయి. ముఖ్యంగా ఇవి తమ గుంపులో నాయకుడుగా ఉన్నదాన్ని తరుముతూ ముందుకు వెడుతూ, వెనకకు వస్తాయి. నిరపాయకరంగా సంచరించే జంతువుల వెంట పోతూంటాయి. ఒకసారి బారాసింగా దుప్పిని, చీటాల్ గుంపులు తరిమి 1/2 కి.మీ. దూరం దాకా వెంటాడాయి. బ్లాక్ బక్స్, సాంబార్ మృగాలు కూడా చీటాల్‌ల వెంట తిరుగుతాయి.

— పిఐబి.ఎస్.ఎఫ్.ఎస్ సౌజన్యంతో

## డొనాల్డ్ బ్రాడ్‌మన్ ఆస్ట్రేలియాకు 20 సంవత్సరాలు ఆడాడు




సుప్రసిద్ధ క్రికెట్ క్రీడాకారుడు డొనాల్డ్ బ్రాడ్‌మన్ ఆస్ట్రేలియాకు 1928 సం. రం నుండి 1948 సం.రం వరకు 20 సం॥ లు క్రికెట్ ఆడాడు. 1938 నుంచి 1948 వరకు ఆస్ట్రేలియా టీముకి కెప్టెన్ పదవిలో ఉన్నాడు. ఆస్ట్రేలియా మరియు ఇంగ్లండ్ టెస్ట్ మాచీలలో మిక్కిలి ఎక్కువ పరుగులను తీసాడు. 1930 లో 214 నిమిషాలలో ఫాస్టెస్ట్ డబుల్ సెంచరీ చేశాడు. 1930 లోనే ఒకరోజులో అధికంగా పరుగులు 309 తీసిన బాట్స్‌మన్ అనిపించుకున్నాడు.

''సర్వేశ్వరుడు చేసిన అపరాధాలను క్షమింపడు. తదనుగుణం

## పుట్టింది?

ప్రపంచంలో కాఫీ ఎక్కువగా బ్రెజిల్ (ద. అమెరికా) నుంచి సరఫరా అవుతుంది. కాఫీ పొదలు మొట్టమొదట ఆఫ్రికాలో అబీసీనియా (ఇథియోపియా) కు నైఋతి దిక్కుగా ఉన్న సారవంతమైన కొండలమీద బయలుదేరాయి అంటే ఆశ్చర్యం! అసలు కాఫీ అనేమాట ఆ దేశంలో కాఫా (Caffa) అనే మండలంనుంచి వచ్చింది.

కాఫీ త్రాగడం అనే అభ్యాసం అబిసీనియాలో ప్రారంభమైంది. 15 వ శతాబ్దంలో అరేబియాలో ప్రవేశపెట్టబడింది. ఇప్పుడు అక్కడ చాలా విస్తారంగా ఉపయోగించబడుతూంది. అందుకే అరేబియా కాఫీ సరఫరా ప్రపంచం అంతటా ప్రారంభించింది.

1718 లో అమ్‌స్టర్ డామ్ (ప. యూరపులో నెదర్‌లాండ్) బొటానికల్ గార్డెన్స్‌లో ఒక కాఫీ మొక్క పెంచబడింది. ఇక్కడ పెరిగిన కాఫీగింజలు కొన్ని డచ్ గయానా సురినామ్‌కు తీసుకుపోబడ్డాయి. అక్కడ నుంచి కాఫీ మొక్కలు క్రమక్రమంగా దక్షిణ అమెరికా బ్రెజిల్‌లో ప్రవేశించాయి.

తరువాత బ్రెజీలులో కాఫీ విస్తారంగా పండటం ప్రారంభించింది. ప్రపంచానికి సరఫరా ఇక్కడనుంచి ప్రారంభమైంది. ఈనాడు కాఫీ ఉత్పాదనకు బ్రెజీలు ముఖ్య స్థానాన్ని ఆక్రమిస్తూంది.

టర్కీలో మంచి విశిష్టరకమైన కాఫీ పండుతుంది యూరపు ప్రజలకు ముఖ్యంగా మధ్య అమెరికా, కోస్టారికా మరియు తూర్పు ఆఫ్రికా కెన్యాలో పండే కాఫీ సరఫరా అవుతుంది భారతదేశం కూడా కాఫీని ఎక్కువగా యూరోపియన్ దేశాలకు ఎగుమతి చేస్తుంది. ముఖ్యంగా కర్ణాటకా కాఫీ ప్లాంటేషన్ తోటల్లో పండే కాఫీ ఇది.

సాధారణంగా కాఫీ పొదలనుంచి కాఫీ కాయలు కోయడానికి అనువుగా ఉండేటట్టు వీటిని 12 అడుగుల ఎత్తుకంటే ఎక్కువగా పెరగనీయరు. కాఫీ చెట్లకు మంచి సువాసన గల తెల్లటి పూవులు గుత్తులు గుత్తులుగా పూస్తాయి. వీటినుంచి ఎర్రటి గింజలు బయలుదేరతాయి. ఈ పళ్ళమీది గుజ్జు తొక్క తీసి లోపల ఉండే రెండేసి గింజలను తీస్తారు. వీటిని కడిగి ఎండబెడతారు. ఆ తరువాత పదునుగా వేయించి పొడిచేసారు.

### 'బైబిల్' పూర్తిగా 286 భాషలలో

విశ్వవ్యాప్తంగా బైబిల్ సొసైటీ వారి పరిశీలన ప్రకారం బైబిల్ గ్రంథం పూర్తిగా 286 మరియు న్యూటెస్టమెంట్ 594 భాషలలోను ప్రచురింపబడింది.

'బాహ్యమైన శిల్పసౌందర్యంతో తృప్తిచెందక చూడవలసిన మూర్తిని చూచునంతవరకు ఆ దిలో బాధపడేవారికి మూర్తి ప్రత్యక్షంఅవుతుంది.'



| | |
|---|---|
| క్రిస్టియన్ మతం: | శాంతి నిర్మాతలు ధన్యులు. వారు తప్పక దేవుని బిడ్డలని పేర్కొనబడుదురు. |
| కన్‌ఫ్యూషియస్ మతం: | పొరుగువారితో స్నేహంగా ఉండు. సోదర మానవులతో శాంతి యుతంగా ఉండు. |
| బౌద్ధ మతం: | శాంతిని మించిన ఆనందం ఇంకొకటి లేదు. |
| హిందూమతం: | ధ్యానం లేకుండా శాంతి ఎక్కడిది? శాంతి లేకుండా సౌఖ్యం ఎక్కడ? |
| ఇస్లాం మతం: | మానవులను దేవుడు శాంతిమార్గంలో పెడతాడు. భగవంతుణ్ణి అనుసరిస్తే వారిని అంధకారం నుంచి శాంతివనానికి తీసుకు వెడతాడు. |
| టావో మతం: | వివేకవంతులు అన్నిటికంటే శాంతినే గౌరవిస్తారు. |
| బహాయ్ మతం: | యుద్ధం మరణం, శాంతే జీవితం. |

—'శ్రీ సత్యసాయి బాల్ వికాస్' సౌజన్యంతో

**మనోభావాలను మానవ సంబంధాలతో సరిపెట్టుకోగల జీవితం సృజనాత్మకంగా ఆనందజనకంగా ఉంటుంది.”**

ఏడు వందల సంవత్సరాలకు పూర్వం ఇటలీలో వెనిస్ ఒక గొప్ప వాణిజ్య కేంద్రంగా ఉండేది ఇక్కడ నుంచి వ్యాపారస్థులు వ్యాపారానికి దూరప్రదేశాలకు పోతూండేవారు.


MARCO POLO

1254 లో వెనిస్ వ్యాపారస్థులు ఇద్దరు ఆసియాకు ప్రయాణం చేసారు. వీరు నల్ల సముద్రం దాటి వెళ్ళారు. ఈ వ్యాపారస్థులు నికోలో మరియు మాఫియో పోలో అనే ఇద్దరు అన్నదమ్ములు. వీరు స్వదేశానికి తిరిగి వస్తూండగా దారిలో ఆసియాలో పెద్ద భూభాగానికి రాజైన కుబ్లైఖాన్‌ను చూడడానికి వెడుతూన్న ఒక దూతను కలుసుకున్నారు. కుబ్లైఖాన్ కచ్చేరి కతే (Cathay) నగరంలో ఉంది. దీనినే ఇప్పుడు చైనా అంటారు. పోలో సోదరులుకూడా అక్కడకు వెళ్ళాలని నిర్ణయించుకున్నారు.

కుబ్లైఖాన్ కోర్టుకి వెళ్ళడానికి వారికి ఒక సంవత్సరం పట్టింది. వారక్కడ మంచి మర్యాదలతో ఆహ్వానింపబడ్డారు. కొన్ని సంవత్సరాల తరువాత ఈ పోలో సోదరులు వెనిస్‌కి తిరుగుముఖం పట్టారు కుబ్లైఖాన్ వారిని తిరిగి రమ్మని చెప్పాడు వారు తిరిగి వచ్చేటప్పుడు ఉపాధ్యాయులను తీసుకు వస్తారని అనుకున్నాడు.

పోలో సోదరులు వెనిస్ నుంచి వచ్చిన తరువాత నికోలోకి మార్కో అనే కుమారుడు పుట్టాడు. పోలో సోదరులు ఇంటికి తిరిగి వచ్చేటప్పటికి ఇతడికి 15 సంవత్సరాలు వయస్సు.

రెండు సంవత్సరాల తరువాత ఈ సోదరులు ఇద్దరు తిరిగి చైనాకు ప్రయాణం సాగించారు. ఈసారి మార్కోను తీసుకు వెళ్ళారు. తరువాత 25 సంవత్సరాలలో మార్కో-పోలో అంతటి గొప్ప సాహసికుడు చరిత్రలో ఎక్కడా కనిపించలేదు.

చైనాకు వెళ్ళేటప్పుడు పోలో బృందం అప్పటికి ఎవ్వరూ చూడని వింత ప్రదేశాలను చూసారు. అనేక దుర్గమమైన ఎడారులు, కొండలు దాటారు. 3½ సం.ల తరువాత కుబ్లైఖాన్ కోర్టుకి చేరుకున్నారు.

కుబ్లైఖాన్ కోర్టులో మార్కోపోలోకు మంచి ఆదరణ, అభిమానం లభించింది మార్కోపోలో ఖాన్ పాలించిన ప్రదేశం అంతా తిరిగాడు. ఖాన్ ఆధీనంలో ఉన్న ఒక నగరాన్ని కూడా మూడు సంవత్సరాల పాటు పాలించాడు.

ఆ రోజులలో యూరప్ కంటే చైనా

'జీవన నౌక దిక్సూచియనదగు మనస్సు భగవానునివైపు తిరిగియుండి చలించునంతవరకు మానవునకు ఏ అనరం వాటిలదు.'

ప్రగతిలో ఉండేది. అక్కడ పెద్ద పెద్ద నగరాలు ఉండేవి. వాటిలో ఒక రేవుపట్టణం ప్రపంచంలోనే మిక్కిలి పెద్దది. పెద్ద భవనాలు, పార్కులు ఉండేవి. కొన్ని కొన్ని భవనాలకు పైన బంగారు కప్పులు కూడా ఉండేవి.

చైనా దేశస్థులకు అప్పటికే కాగితం తయారుచేసే విధానం తెలుసు. కొయ్యపలకలతో అచ్చుకూడా వేసేవారు. వారప్పుడే కాగితం (సొమ్ము) నోట్లను చలామణిలో దీనివల్ల లోహపు నాణాలకంటే సులభంగా సొమ్మును తీసుకువెళ్ళడానికి వీలుగా ఉండేది. ఒక చోటనుంచి మరో చోటికి శీఘ్రంగా వార్తలను పంపడానికి రన్నర్సును నియమించారు.

చైనాలో మంచి మంచి రోడ్లు ఉండేవి. వారు పెద్ద గోడను, పెద్ద కాలువను (గ్రేట్ వాల్, గ్రేట్ కెనాల్) నిర్మించారు. నల్లటి రాతిబొగ్గును ఇంధనంగా ఉపయోగించేవారు. మంట నిరోధకమైన వస్తువు ఆస్బెస్టాస్‌ను గురించి కూడా వీరికి తెలుసు.

వెనిస్ మరియు జెనోవా (Genoa) ల మధ్య జరిగిన యుద్ధాలలో మార్కోపోలో పట్టుబడకపోయి ఉంటే మార్కోపోలో కనిపెట్టిన క్రొత్త విషయాలు మనకి తెలిసి ఉండేవికావు. జెనోవా చెరసాలలో మార్కోపోలో తన అనుభవాలను మరొకడికి చెప్పాడు. అతడు వాటిని వ్రాసి ఉంచాడు.

ఇంతలో మార్కోపోలోను చెరసాల నుండి విడిచారు. ఇతడు 70 సంవత్సరాలు జీవించాడు. అనేకమంది ఇతని గ్రంథాన్ని చదివారు. కాని కొంతమంది మాత్రమే దీనిని విశ్వసించారు ఇతడి స్నేహితులు కూడా చాలామంది ఇది కట్టుకథ అన్నారు. మరణావస్థలో ఉన్నప్పుడు మార్కోపోలోను అతడు రాసినవన్నీ కథలని ఒప్పుకోమని బలవంతంపెట్టారు. అప్పుడు మార్కోపోలో 'నేను చూసినదాంట్లో సగం కూడా చెప్పలేదు' అని చెప్పాడు. మార్కోపోలో చెప్పిన ప్రతీ మాటా వాస్తవం అని మనకి ఇప్పుడు తెలుసు.

## ప్రప్రథమంగా అతి విస్తారంగా ఉత్పత్తి కాబడిన కారు



యునైటెడ్ స్టేట్స్‌లో మోటార్ కారు తయారీదారుడు హెన్రీఫోర్డు I (1863 - 1947) చిన్న కుటుంబానికి సౌకర్యంగా ఉండే మోడల్ T ఫోర్డు కారును ప్రవేశపెట్టాడు. ప్రపంచంలో అతి విస్తారంగా తయారు చేయబడిన కారు ఇదే. 1908 నుంచి 1927 దాకా 1,50,00,000 పైబడిన ఫోర్డుకారులు యునైటెడ్ స్టేట్స్‌లోను ఇతర విదేశాలలోను అమ్ముడైనాయి.

'ఆత్మకాని దేహాన్ని ఆత్మ అనుకోడం అహంకారం,
అహంకారం ఉన్నంతకాలం అంతరాత్మను చూడడం అసాధ్యం.'

EDITED, PRINTED AND PUBLISHED BY K V. GOVINDA RAO
AT No. 9, DESIKA ROAD, MYLAPORE, MADRAS-600 004 (INDIA)
PRINTED AT
*Desh Publications (P) Ltd. Madras-14 (Ph : 848084,*

